వ. ఇంతకు మున్ను చెప్పినదే యయ్యు బిచ్చగాండ్రంగుఱించి మఱియును
గొండొక వచించెద నాలింపుఁడు. ౧౨౩

మ. ప్రతివాఁడుఁ జనుదెంచు "ముష్టి" కని దుష్పాత్రంబు లందెన్నియో
వెతకన్ గన్పడుచుండు, గేస్తుల వృథా వేధించునివ్వాండ్రదు
ర్గతి శోచ్యం బగుఁగాక, పెట్టుటయె యుక్తం బెరా లేదన్న న
ప్పతితు ల్లోఁగనియప్డు మానుటకు లాభమ్మేమి గన్పట్టెడిన్. ౧౨౪

ఉ. "ఏదొ పురాకృతంబుననె యీచెడుకర్మము వాండ్ర కబ్బె" సం
చాదృతి లేకయుండినను నంతయె! యింతయె? పెట్టి పంపుపే
నాదుమతంబు వాండ్రు జననాథునిశిక్షకుఁగూడ లోఁగ, రం
చేఁ దలపోసి చెప్పితి గ్రహింపుఁడు నాయనలార? నానుడిన్. ౧౨౫

ఉ. "పెట్టినవారికిన్ మరలఁ బెంపుగఁ బుట్టుబె సాక్షి" యండ్రు వాం
డ్రెట్టిరొ? స్వల్ప మిచ్చుటకు నెందుకుఁ జర్చలు, తారతమ్యమున్
బట్టి యొసంగునీవికి నపాత్రపుటీవికి భేద ముండుఁగా
కట్టిది గోరుముష్టియెడ నారయఁబోరు వివేకు లెవ్వరున్. ౧౨౬

గీ. ఇప్పు డెల్లవర్ణంబులు నిందు దిగియె
భవతు మాన్పింప వాండ్ర నెవ్వరితరంబు
"ఎలుఁగుబంటితంటస" మనియెడి విధాన
నుందు నిట్టి పరీక్ష కే రుత్సహింత్రు. ౧౨౭

ఉ. నిక్కము నెంచి చూత మన నేఁ డొకవిప్రుఁడు మ్రొక్క నర్హుఁ డే
దిక్కునఁ గానరాఁ డిదియు దేశపుదుర్గతి గాక యేమి? యిం
కొక్కటి, తక్కుజాతులకె యున్నది బ్రాహ్మణవిద్యలందుఁ బే
రెక్కినశ్రద్ధ; బ్రాహ్మణుల కెప్పుడు నున్న దనాస్థ వానిపై. ౧౨౮

క. కొందఱు బ్రాహ్మణశబ్దం, బెందుకు వచ్చినదిమన 'కరే?' యనిచింతన్
గుందెడి ఘనులును నున్నా, రుందురుగా కట్టివారి నొగిఁ జేర్పకుఁడీ.

క. దేవబ్రాహ్మణభక్తి ము, దావహమగు నామమాత్రులగు బ్రాహ్మణులన్
సేవింపకున్న వృథగా, నేవిధమున వెక్కిరింపు లెంతయు ముప్పౌ.

గీ. మనకు నైశ్వర్యమున్నది యని సదాచ
రణము విడనాడకుండ దపరాధ, మెపుడు
స్నానసంధ్యాజపములను మానరాదు
మనుఁడు బ్రాహ్మణ్యమున కిది మంచితెలివు. ౧౩౧

వ. అని మఱియును ౧౩౨

మ. ఎపుడో బుద్ధికిఁ దోఁచెనేని మిము నే నీక్షింప నేతెంతు, మీ
రిపుడున్ బోలె మఱెప్పుడేనియును రానే వచ్చు, సన్న్యాసి గా
నిపు డే, సిద్ధి తృతీయమాశ్రమము మీ రేగుండు శ్రీనాథుఁ డెఁ
ల్లపుడున్ మీకు సుబుద్ధి నిచ్చి వరదుండై మిమ్ముఁ గాపాడుతన్.

వ. అట్లు కొమరుల నంపి యాతం డచ్చటన సుఖం బుండె. ౧౩౪

గీ. రాచతపసియందున ననురక్తి గల్గు
వారు పెక్కురు గల్గియు నేరుగాని
పిలుచుటకు రారు రాజేంద్రుతలఁపు మున్న
వారు పూర్ణమ్ముగ నెఱుంగువారు గాన. ౧౩౫

క. మూఁగురు మూర్తులు నాపె వి
రాగం బంగమ్ముఁ దాల్చురాణ నచట వి
ద్యాగోష్ఠియు భగవత్సే
వాగోష్ఠియుఁ గలిగి యెలమి వసియించునెడన్. ౧౩౬

గీ. బ్రహ్మబంధువుల్ గొంద ఱవ్వారిపయి న
కారణద్వేష మూని యక్కలికిగొనము
"మంచిదై యండ" దంచు లో నెంచి యూస
డించుమాటలకు నుపక్రమించుటయును. ౧౩౭

గీ. వేత్తలగు బ్రాహ్మణులు సుదుర్వృత్తులైన
వారలను మందలించి "యెవ్వారుగాని
వ్యర్థమగు నపవాదలు పైవరాదు
వేశ్యయైన నేమయ్యె! సద్వృత్త యాపె. ౧౩౯

క. ఆపెకుఁ గలయోగ్యతలో, నేపాటియు లేని మీర లెంచుటకో? యీ
పాపపుఁబల్కులు వల్కుట, శాపానుగ్రహసమర్థ జాగ్రత్తసుఁడీ!

గీ. నామమాత్రమ్మునకు బ్రాహ్మణజని నెత్తి
యితర మేమియు లేని మీవృత్తి మేడ?
ఆపెసద్వృత్త మేడ? మీయంతఁజనుఁడు
వృథగ నార్జించికొనకుఁడు వృజినభరము. ౧౪౦

వ. ఏవిధమగు మంచియును లేని మీవంటిసత్రభుక్కులకతమున బ్రహ్మజా
తికిం గలుగుకళంకం బింతింత యన నలవిగా దని మఱియును. ౧౪౧

ఉ. ఈదృశదుర్గతిం గనియు నేయితరాన్వయులేని యోగ్యతా
పాదకమైన వర్తనను వర్తిలఁ జూచి సహింపలేక దు
ర్వాదులు గట్టునట్టి యపరాధము లంతటఁ బోవు జాతిమ
ర్యాదకు హాని దెచ్చు నపరాధకు లీరు క్షమాపణార్హులే? ౧౪౨

ఆ. ఒకరి ''జోలి సొంటి" యొక్కించుకయు లేమి
భగవదర్పితముగ బ్రదుకు సర్వ
మావెలంది గడపు నార్యసమ్మతముగా
నెందు కాపెఁ దెగడ నెంతు రీరు. ౧౪౩

వ. ఇట్లు గాఢమ్ముగా మందలింప నమ్మూర్ఖు లుపశమించిరి పదంపడి.

ఉ. పేరును బెంపునుం గలుగుపెద్దకుటుంబమునందుఁ బుట్టి యా
వారవధూమతల్లి కులపై ఖరి పూర్తిగ వీడి యెట్టి సం
సారులు మెచ్చుకోఁ దగినచందము నంది రహింప సంఘసం
స్కారులు తత్కులస్థులు వెసన్ జనుదెంచి వచించి రొక్కెడన్.

క. మనకుల మెప్పుడు పుట్టెనొ ?
మనమా టటులుండ నితరమహనీయులు గూ
డ నెఱుంగ, రిది యనాదిగ
వినఁబడెడిఁ బురాణములను విశ్రుత మగుచున్. ౧౪౬

ఉ. ఎందఱు దేవతల్ చనిరొ ? యెన్ని ప్రభుత్వము లేగెనో ? జగం
బందు, మఱెన్నఁడుం గలుగనట్టివి మార్పులు నేఁడు పుట్టి యం
దం దొకవిప్రులన్ విడిచి యందఱఁ దొందఱ వెట్టుచున్న వే
మందువు తల్లి ? యాత్మకులమందలిచెట్ట లడంచుపట్టునన్. ౧౪౭

మ.కవయిత్రుల్ ఘనగాయనీమణులు భూకాంతార్థదేహంబులై
అవనీపాలురఁ గన్నయమ్మలుఁ గులం బందెందఱో యుండియున్
శివ ? యేమందుము తల్లి ? పూరుషు లెటన్ శీర్షంబు పై కెత్తుగా
రవము న్నోఁచినయట్లు లేమికి విచారం బేరికిన్ గల్గదే ? ౧౪౮

సీ. "విజయవిలాస" కవిప్రవరుం డల్ల
చేమకూ, రెవఁడు ? రోచామకొడుకె
"రాధికాసాంత్వనం" బేధీమతి రచించె
ముద్దుపళని మనముద్దరాలె
"పంచరత్నము" లను పదవర్ణములు చేసె
'వడివే' లెవఁడు ? మనవాఁడు గాఁడె
వీణలో నాటకవిత్వమ్ములో మేటి
'మధురవాణి' యు మనమగువ కాదె ?

గీ. కొలఁదికాలముక్రిందటఁ గుతల మేలెఁ
జక్రవర్తిత్వమున నొకక్షత్రియుండు
జనని యతనికి మనజాతిసాధ్వి కాదె ?
ఇట్టి మనజాతి యిప్పుడు హీన మయ్యె. ౧౪౯

చ. భరతుఁ డెవండు ? వ్యాసభగవంతుసుతుండు శుకుం డెవండు ? ము
న్నరున కులూచి తాఁ గనె జన్యశుతుఁ డాతఁ డెవండు ? ధారుణీ
సురులకు వంశకర్తలగు శుద్ధులలోఁ బలుమంది మౌను లె
వ్వరు ? ప్రకృతంబు వారె మనవంగడమున్ వచియింత్రు పందగన్.

గీ. ఇతరఖండంబులందున హెచ్చుగ వ్యభి
చార మున్న దీనికె నొకజాతి యన్న
యేరుపాటు లేదఁట ? మన మిందు కేరు
పడుకతన దూష్యుల మటంద్రు పలువు రిపుడు. ౧౫౧

ఆ. ఆర్యు లింతదనుక నాదరింతురుగాక !
స్వార్థపరత వారియందుఁ గలిగి
''ఆదరింపఁజేసె'' నని యంద్రు నిజమగుఁ
గా, కసత్యమగును గాక యదియు. ౧౫౨

ఉ. పెండిలి లేక యెల్లరకుఁ బెండ్లము గాఁదగు శోచ్యవృత్తిలో.
నుండెడి స్త్రీలసోదరుల కుత్తమసభ్యత గల్గకుంటచే
బెండుతనాననే మనదు పెద్దలు కాలము వెళ్లఁబుచ్చి రె
వ్వండు యతింపఁ డీపరిభవం బుడిగింపఁగ నేయుగంబునన్. ౧౫౩

చ. "కులమున కుండువృత్తి యది కూడినదైనను గానిదైన న
క్కుల మది యెన్నఁడున్ విడువఁగూడ" దటంచు ఋషు ల్లిఖింప రా.
జుల కవి శాసనంబు లగుచున్ జగ మేలఁగఁ జేసెఁ బిమ్మటన్
గలి చనుదెంచెఁ గాని కసుగందవ యాఋషులాడునేమముల్. ౧౫౪

చ. క్రమముగ నిన్న నేఁ డితరఖండజనుల్ నృపులైరి వారిమా
ర్గములకు నీఋషీశ్వరులు గారు ప్రమాణ ''మొకూరిరాజచం
ద్రిముఁడు మతొక్కయూరి కగుఁ దా నొకమాలగ'' వారి కన్నివ
ర్ణము లొకమ్మాదివే యగుట నచ్చకపోయెఁ గులప్రభేదముల్ ౧౫౫

ఉ. అందఱు రెండు నక్కరము లబ్బినమాత్రన రాజభృత్యులై
యెందుననో నియుక్తు లయి యే"తృణమో?" "తుషితంబొ?"తెచ్చికొం
చుం దమవృత్తులన్ మఱచి "షోకుల" బాల్పడుచుంటఁ జూచి ఆ
యందము నచ్చి పుత్రకుల నందునఁ జొన్పిరి యెల్లవారలున్. ౧౫౬

ఆ. పుత్రకులనె కాదుపుత్రికలంగూడ, నందుదింపి వారియార్జనము కు
టుంబమున్ భరించుసంబరమున కియ్య.కొనెడివారుగలరుకొందఱిపుడు.

ఉ. వేదము శాస్త్రముల్ జదువ విప్రులకే అది వచ్చు గానమో?
రా దది యెల్లవారలకు రమ్యతరంబుగ; హూణభాషమ
ర్యాద యదెట్టిదో? యెవని కైనను లోఁగుటఁజేసి యెల్లరున్
భేదము లేక యందు దిగి వృత్తులు వీడిరి యొక్కపెట్టునన్. ౧౫౭

ఉ. బాపఁడు బుజ్జులన్ గొలుగవచ్చును మాలెత రెండు నక్కరాల్
చేపడుమాత్ర నొజ్జపని సేయఁగవచ్చును దోలుచెప్పులన్
గోపుఁడు కుట్టవచ్చు 'నిది కూడును గూడదు' నాఁగఁ జెల్ల దం
చీపరిపాలనమ్మున యథేచ్ఛ యొకం డుదయించె నెల్లెడన్. ౧౫౮

గీ. ముందు బ్రాహ్మణజాతి దా మూలమూల
నిఱికినది గాని క్రమముగా నిందు దూఁకి
యెంతవఱ కేగవలెనొ ? తా నంతవఱకు
నేగితీరిన దిపు డది యాఁగవలసె. ౧౫౯

ఉ. వారిని జూచి వారు మఱి వారిని జూచియు నింక నొక్క ర
వ్వారిగ నెల్లవారలును వారక "చేపలు తియ్యనీటికిన్
జేరినభంగి" నీకృషిని జేయఁదొడంగిరి: అస్మదీయు లీ
దారికి లెక్కమానినులె తారిరి తల్లులు సమ్మతింపమిన్. ౧౬౦

ఉ. తల్లులమాట యెట్లయినఁ దండ్రులు గొందఱు పట్టుఁ బట్టి తా
రెల్లెఁగ నిందు దింపిరి 'యెమ్మే'లు 'బి.యే'లును బెలుదేఱి పెం

పుల్లసిలంగ గౌరవము లొందిరి వారల కాత్మవృత్తిపై
నెల్లిదముగా జనించుటకు నెవ్వరు సమ్మతి చూపకుందురే ? ౧౬౨

క. మే మంతగఁ 'దద్విద్యా.శ్రీమహితుల' మంచు నీకుఁ జెప్పము మనలో
ధీమంతులు నుద్యోగులు, సామంతులుగూడఁ గలరు సంస్కారేచ్ఛల్.

గీ, వారిలో వా ర్వివాహసంబంధములను
జేసికొందురు కులమును జిందనాడ
రంపులను వృత్తి మానుచో నదియుఁ గష్ట
మనుచు వారు నెఱుంగుదు రది యటుండె. ౧౬౪

ఉ, ఏ మొకకొంతమంది కులవృత్తిని బూర్తిగ రూపుమాపఁగా
మామదిలోఁ దలంచి కులమాతలనెల్లరఁ జేరి కొందఱన్
సామముచేతఁ గొందఱకు జంకును గొల్పుటచేత నెట్టులో
యీమతమున్ గ్రహించునటు లించుక చేసితి మెట్టకేలకున్. ౧౬౫

క. మదిమాన్యము లెన్నెన్నో, గడియించిరి దీన నుండి గానకళన్ బే
ర్వడసిరి వారల కిది యిప్పుడు వీడుట చాలఁ గష్టముగనే యుండున్.

క. 'ఇది మంచిత్రోవయే'యని, మది కెక్కియుఁగూడ వృద్ధమాతలు దీనం
బొదలుటకు నొప్పికొన 'రే,మిది' యనఁ బ్రతి నెప్ప రెట్లు కృషి యిది [నెగ్గున్.

ఉ. నెగ్గిన నెగ్గకున్నను'మనీషిహితం'బని యెంచి మేము కే
లొగ్గి కులంపుఁబెద్దలకు, నోపికమైఁ గృషి సల్పుచుంటి మే
యొగ్గును లేని వృత్తు లని యెక్కడ నుండక పోవుఁగా కయో!
'బగ్గున' మండుఁ బో ? యొడలు; పాపపుభోగమువృత్తి నెంచినన్.

క. ఎటు సైఁచిరో? పెద్దలు కట,కట! యియ్యది జాతిజీవకముగాఁ గొని యి
ప్పటికేని కనులు దెఱకవ,తటకాపడి చూచుచుంట తగునే మనకున్.

తే. పెద్ద లొనరించినట్టి 'దీవృత్తి'యనుచు
మనముఁగూడ నొనర్చుట మంచి కనె ?గు

'తాత ద్రవ్వించె నూ' యని దాన నూరు
నుప్పునీటిని ద్రాఁగువా రుర్విఁ గలరె ? ౧౭౦

క. నీసాయమ్మున మే మీ,దోసమ్మును నిస్తరించి తోయము నెల్లన్
వాసింపఁ జేయనెంచితి, మోసాధ్వీ ! సాయపడుట యుక్తము నీకున్.

ఉ. నీ వఖిలమ్ము వీడితివి నీకుఁ గులస్థులతోఁ బనేమి ? కా
నీ ? వెలయాంధ్రదుస్థితికి 'నీహృదయంబు తపించు' నంచు మా
భావము విశ్వసించి యిటు వచ్చితి మమ్మరో ? వేశ్యవృత్తి కా
దేవుఁడు సమ్మతించినను దేశము సమ్మతి నీ దెఱుంగవే? ౧౭౨

వ. నావుడు నవ్విరాగిణి యి ట్లను, నో యయ్యలారా ! మీయుద్యమంబు సర్వథా శ్లాఘ్యంబు. మీప్రయత్నంబు నిషేధించువా రుండరు. కారణం బియ్యది యాపాతరమణీయంబుగఁ గన్పట్టుటే, లోకమం దీవృత్తియే లేకుండఁ జేయుట మీక కాదు భగవంతునకేని శక్యంబు కాదు. మీరేయే దేశంబులంబట్టి యీసంస్కారమ్మున కుపక్రమంచితిరో? ఆదేశంబులం దిట్లు కాకున్న నింకొకరీతినేని యీరసాభాసంబు విస్తరించి యున్న యదియే యని విజ్ఞులు నొడువుదురు, అట్లే కాకున్న నచ్చటిపట్టణంబు లయందుండు స్వైరిణులకు దినదినమును యోగ్యతాపత్రము లెందు లకు ? భవతు దానితో మనకుఁ బనిలేదు, "సర్వ స్స్వార్థం సమీహ తే" కనుక మనవేమము మనము చూచుకొని మనజాతి నీదుర్వృత్తి నుండి తప్పించుటయే కర్జము. ఇష్టానిష్టమ్ములం బట్టి యీవృత్తి నవ లంబించుటకును మానుటకును మనయంగనల కిదివఱకే స్వాతంత్ర్య ముండుట మీయెఱుంగనిది కాదు సర్వశూన్యంబుగా నీవృత్తిని మన కులమ్మున రూపుమాపుటకు మీరు శ్రమచేయుచున్నారు. మీకు భగవం తుఁడు తోడ్పడుఁగాక యని వెండియు. ౧౭౩

శా. ఏదుర్వృత్తియుఁగూడఁ బొట్టకొఱకే యేర్పడ్డ దన్నందుకున్
వా ధాడంగలవార లుండరు ధనోత్పత్తిన్ వెసం జేయుచో

నేదేనిం గయికొంద్రు మానవులు; మీ రీవృత్తి వర్తించుచోఁ
బో దీవృత్తి మఱొక్క రిందు దిగుచే ముమ్మాటికి న్నిక్కమౌ. ౧౭౪

చ. దిగుదుసగాక వేఱొకరు దీనికి "న"ట్లసి మీ కుపేక్ష గాఁ
దగదు స్వశక్తి సర్వమును ధారఁగఁ బోయుఁడు దీనిఁగూర్చి యే
రెగఁబడిరేని యేమి చెడు? నేవము వారలకే ఘటించు మీ
తెగ నగుఁబాటునుండి కడతేఱుటె కావలె మీకు సర్వథా. ౧౭౫

గీ. "ఎవ్వరో తప్పు పని చేయు టెట్లుఁ దప్పు"
దనుచుఁ దాన యప్పని సేయు నజ్ఞుఁ డున్నె?
ఉండఁ, డొక్కటిమాత్ర మిందున్న దేను
జెప్పఁదగ్గది చెప్పెదఁ జెవుల నిడుఁడు. ౧౭౬

మ. కళలం దెన్నిక గన్న నాట్యకళ కీకాంతామణుల్ దక్క నే
కులకాంతామణుల లర్హురాం డ్రనుట కేకొంచెమ్ము నంగీకృతిన్
గొలుప ర్విజ్ఞులు; నేఁడు వారలను మూర్ఖుల్గాఁ బ్రసంగించువా
ర్గల రేకొందఱొ వారివాద మది శుష్కం బొప్పికో ర్కోవిదుల్.

చ. కులసతి నాట్యరంగమునకున్ జని వేఱొకపూరుషు న్నటున్
గలసి తదంగసంగతిని గైకొని నాట్య మొనర్చ లేశమున్
గలఁగనిదయ్యె "సంస్కృతిని గాపురముం బొనరించు నర్హతన్
గల"దని యాత్మవంచకులు గాని కవుల్ వచియింప రెవ్వరున్. ౧౭౮

వ. ఇయ్యది సంసారిణులుగా నుండి సభలలో నాట్యమును బ్రదర్శించు స్త్రీలకు సంబంధించు నంశముగాని మీయుద్యమమునకు సంబంధించునది కాదు. కాని ముందు ముందు సంసారిణులుగా మాఱికూడ నితరసంసారిణులతోపాటుగ నిద్దానికి నగ్గమగునెడల వారలతోపాటు మీకును నియ్యది యనువర్తించి తీరు నని వెండియు. ౧౭౯

చ. పౌలఁతులమాట కేమి? మును పూరుషులేనియు నాట్య మాడువా
రలవెనువెంట నంటి చని రాగముఁ దీయుచుఁ దాళమేయుచున్

మెలఁగుట "యేవ" మం చనిరి మేటికవీశ్వరు, లట్టివాండ్రు పెం
డిలికి యతింప నీయమిని నిల్చి రనేకులు బ్రహ్మచారులై. ౧౯౦

ఆ. గొడ్డుచర్మములను దొడ్డగా నుతికి బా
గొప్పఁ జేయుపిదప గొప్పవారు
తాల్చునట్టి నేఁడు తళతళల్ హెచ్చుటఁ
జేసి రంగభూమి సేవ్య మయ్యె ? ౧౯౧

ఉ. వీధుల నాడుభాగవతవేషము లెట్టివొ ? యివ్వి యట్టివే
గాధలుగూడ నట్టివియె కాని ధనంబు వ్యయించి తత్కళా
రాధకు లందచందములు రంగులు భంగులు గూర్చి తత్కళా
సీధువుఁ గ్రోలఁ జేసెదరు చిన్నలఁ బెద్దల నెల్లవారలన్. ౧౯౨

ఆ. పల్లెటూరినుండి భార్యతోఁ బిడ్డల, గుంపుతోడఁ బిల్లికూనతోడ
నేమ మొప్ప నొగి "సినీమా"కు రై తేగు,వారమునకు రెండుసారులేని.

వ. పట్టణవాసస్థులం గుఱించి చెప్ప నక్కఱయే లేదుకదా యని మఱియును.

గీ. తోలుబొమ్మలాటలె "సినీమా"ల యాట
లపుడు గరిపెభాగవతము లిపుడు తెరల
నాటకమ్ములు వీని కానాఁడు లేని
గౌరవము నేఁడు క్రొత్తగాఁ గలుగుటెట్లు ? ౧౯౩

చ. కులమును సంస్కరించుటకుఁ గోరిక పూర్తిగ మీకు నున్నచో
వెలచెలు లేరు రంగముల విద్దియ చూపుట కేగకుండఁగా
వలయు టటుండ నేరొ ? కులవంతుల మానిను లేగి రంచుఁ బో
వలవదు వానిఁ జూచుట, కవశ్యము నా క్షితు తోఁచి చెప్పితిన్. ౧౯౪

వ. నే నీవిషయమ్మున నింతగా నొక్కి వక్కాణించుటకుఁ గతం బేమందు
రేని ? ౧౯౫

ఉ. మాపురి నొక్కబ్రాహ్మణుఁడు మంచికుటుంబి, వివేకి ప్రేలితోఁ
జూపఁగ వీలు గావి పరిశుద్ధుఁడు కూఁతులుగూడ నట్టిరే

ఆపసిపాప లిప్పటికి నాటియుఁ దేటియుఁ బెండ్లి లేనివా
రై పడియుంట సంఘటిలె నక్కట ! రంగముల న్నటించుటన్.

క. 'రంగ' మనఁగ ? 'రంగూ' నే
వెంగలు లెఱుఁగంగ లేక వెటివెఱ్ఱినుడుల్
సింగారింతురు పత్రిక
లం, గాదని యన్నవారల న్నగుదు రొగిన్. ౧౫౯

వ ఇప్పటిమా కెట్లులైనను మనకులస్థు లక్షరాభ్యాస మైనంతమాత్ర నక్క న్నియను వివాహమాడు వారు కారని మీరును నెఱుంగుదు రని వెం డియు. ౧౬౦

చ. కులమును బాగు చేసికొను కోరిక కియ్యది బాధకంబుగాఁ
గల దని యిట్లు చెప్పితిని, గౌరవ మున్నకుటుమ్మువార లె
వ్వలనఁ జరించినన్ మనకు వారలతోఁ బని లేదు వారిపూ
ర్వులచరితంబులన్ మెలఁగి పూతిని బూత మొనర్పఁగాఁదగున్.

వ. ఈచెప్పెడి విషయంబు లోఁగడ వచించినదియే, మిగులనావశ్యకం బని తెల్పుటకుఁ జర్వితచర్వణం బొనర్పవలసి వచ్చె నది యేది యని ప్రశ్నింతురేని. ౧౬౧

మ. మఱియొం డేను వచింతు "గేహిని 'సినీమా'' తార గాకుండ నే
ర్పుఱుపంగావలెఁ గట్టుఁబా" టనుచుఁ జెప్పంగాఁ బనే లేదు మీ
రెఱుఁగుం డాపె తదీక్షణమ్మునకుఁ దా నేనాఁడు పోఁగూడ దె
వ్వరు సాక్షిజ్జగదీశునాంధ్రు చనినన్ వా రొజ్జలే? యేరికిన్. ౧౬౨

వ. ఇయ్యది నాకు నాయంతరాత్మ బోధించినతెఱంగు మీ కిది నచ్చినను నచ్చకున్నను నేను జెప్పెడిదిమాత్ర మింతియే, మీయుద్యమంబునకు దైవంబు తోడ్పడుఁగాక యని దీవించుటయు సంతసించుచు వార లరిగిరి యనంతరంబు. ౧౬౩

ఉ. పూవులు వారు మూఁగురును బొంతవనమ్ముల కేగి తేఁగన
ద్దేవుని కాపె పల్వగలఁ దీరిచి భక్తి నలంకరించున
ట్లావల దేవళానఁ గలయర్చకపాళికిఁ జెప్పఁ, బుట్టువున్
బావన మిట్లు చేసికొనుభావముతోఁ జెలి యుండె నయ్యెడన్. ౧౬౪

గీ. ఎన్ని వేదముల్ వెదకిన నెన్ని సత్పు
రాణములను గావించినవాణె మైన
దైవ భక్తికి మించిన తారకంబు
లేదు ముమ్మాటికిని లేదు లేదు లేదు. ౧౬౫

క. భాగవతమ్మును దఱచీ, యోగము వచియించె గీతయు న్వచియించెన్
యోగివరు లెవరొ వేతొక, లాగునఁ దరియింతు రది యలఁతులకువశమే

ఆ. అందుఁగూడ భక్తి నాంతరీయకముగా
నుండి తీరుఁ గాన యోగులెల్ల
భక్తిమార్గముననె పరమేశ్వరునను గ్ర
హంబు వడసియుందు రనుట ధ్రువము. ౧౬౬

క. కులమనియున్ మఱి తీర్థ
స్థల మనియున్ స్నాన మనియు జప మని భక్తిన్
గలఁచెడివారికి నేమ
మ్ములతోఁ బనిలేదు కలుగు ముక్తి యొకపనిన్ ౧౬౭

గీ. కేవలాకాశమున మది గీలుకొల్పి
యన్నిరాకారు ధ్యానింపు మనుటకన్న
వేదియో మూర్తి కల్పించి యెదఁద నిల్పి
అర్చ లొనరింపు మనుటయే అతిసుఖంబు ౧౬౮

గీ. సంసృతి దరించువారికిఁ జాల మార్గ
ములను జూపిరి తత్త్వవేత్తలు మహాత్మ
లందులో భక్తి సర్వత్ర నాంతరీయ
కముగ భాసిల్లు భక్తి యొక్కరిధనంబె? ౨౦

గీ. అలగజేంద్రుండు పశువయ్యు హరినిగొల్చి
తత్కటాక్షంబు గణియించి ధన్యుఁ డయ్యె
భక్తికి వశుం డగును భగవంతుఁ డెల్ల
భంగులను భక్తి గడియింపవలయు నరుఁడు. ౨౦

క. పితృభక్తి మాతృభక్తియుఁ, బతిభక్తియు దేశభక్తి పరమేశపద
ద్వితయీభక్తియు నివి స, ద్గతితెరవులు భక్తి సకలకలుషము లడఁచున్.

వ. నాపుడు శౌనకాదులు సంతసించి యతనిం బ్రశంసించి యప్పటికి సభ
చాలించిరి. ౨౦

శ్రీ శ్రీ శ్రీ

ఆశీర్వాచనము.

క. హరిపాదసరోరుహ బం, భరితాంతఃకరణుఁ డుత్తమచరిత్రుఁడు భూ
సురభక్తుండు జగన్నా, ధరావు చిర మలరుఁగాక ధన్యత కిరవై.

గద్య

ఇది శ్రీ తిరుపతివేంకటీయంబగు సుశీల యను కేవలకల్పిత
ప్రబంధమ్మునందుఁ బంచమాశ్వసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః

# సుశీల

తిరుపతి వేంకటీయము.

## షష్ఠాశ్వాసము.



వ. మరల ఋషులు నిర్వర్తితజపతపోనుష్ఠానులై సూతు నుద్దేశించి యవ్వ
లికత నొడువుమనుటయు నతం డిట్లు వఖ్యానించె నట్లాపెయు న
మ్మాఁగురు మూర్తులును భగవత్కైంకర్యపరాయణులై యప్పర్వత
రాజంబునఁ గాలయాపనం బొనర్చుచున్నంత. ౧

శా. కాసారమ్ములఁ బద్మముల్ గుముదముల్ గన్పండువుల్ సేయఁ బ్రొ
ద్దీసాధ్వీమణి పాఁడిపంట లెచటన్ దేదీప్యమానమ్ములై
భాసిల్లన్ శరదాగమంబు దెసలన్ వ్యాపించెఁ గాశమ్ములుం
దీసంపన్నులమానసంబులబలెన్ దీపించె నభ్రంబులున్. ౨

క. కాశంబులతో భువి యా, కాశం బచ్ఛాభ్రరాజిఁ గాళీపూజా
వేశమ్ములతో శాక్తే, యాశయములు నలరె శారదాగమవేళన్. ౩

వ. అప్పర్వతంబున శ్రీమన్నారాయణు నర్చావతారమ్మునకుఁ జాలఁ బూ
ర్వకాలమ్మునుండియు దుర్గాదేవి యందలిదరీగృహమ్మున స్వయంవ్య
క్తయై యొప్పారుచుండు నయ్యంబికం బూజించు నర్చకుండు వామా
చారతత్పరుండు చిరమ్మునుండి దుర్గకు నరబలి నొసంగి తదనుగ్రహం
బు వడసి భూమండలాధిపత్యంబు సంపాదించు దురాశతో నుండువాఁ
డివ్వారవధూమణిం గాంచినది మొదలు కళాపూర్ణోదయంబునందుఁ బిం
గళిసూరనార్యుండు కలభాషిణింగూర్చి సిద్ధుం డొనర్చిన మోసంబు మ

నంబునం దలంచుకొని యెట్టేని మహాష్టమినాఁడు తనమనోరథంబు
నెఱవేర్చుకోఁ దలఁచి యూరక రిత్తకోరికలతోఁ దనలోఁ దా నిట్లు
తలపోసికోఁ దొడంగె. ౪

ఉ. ఊరక ఖండఖండములు నుండునృపుల్ శలభంబులట్లు కం
గారున కగ్గమై పొలియు కాలము గావునఁ గాళి కిప్పు డీ
వారసతీమణిన్ బలిగ వైచితినేనియుఁ దన్నుఁ జేర్చు న
వ్వారలరాజ్య మేదియొ ? యవారణ నాయమ తుష్టచిత్తయై. ౫

క. 'కాళీ' యున్నప్పుడె య, క్కాళి యయినఁ బదవి నీయఁగానేరుచు నే
'కాళీ' యు లేనిచో నా, కాళియు నొసఁగంగ శక్త గాదని యెంచున్.

సీ. విప్రబాలునిఁ బాతిబెట్టి యాకంఠ మ్మ
ఖండదీపము శీర్షగత మొనర్చి
దానివెల్గునఁ ద్రవ్వి ధననిధానమ్ము గై
కొని రెడ్డి రాజయి కొనియెఁ బదవి
మఱియొక్క సంసారి మాలనిఁ దత్సమ్మ
తిని బలి యిచ్చి కైకొనియె నిధిని
గావున నిది తప్పు గాదు "బంగాళీ"లు
కొంద ఱిప్పుడుగూడఁ గొంక రనుచుఁ

గీ. శిష్టులగువారు పలువురు చెప్ప వింటి
ఘనుఁడు పింగళి సూరన కవివరుండు
వ్రాయఁ డూరక, యిది యిచ్చు రాజ్యపదవి
నవలఁ బాపికొనఁగ వచ్చు నఘ మెయైన. ౬

క. ఆలము లొనర్చికద ? భూ, పాలకు లగుచుందు రెన్ని ప్రాణము లందున్
జాలుగబలియగునిది కదుఁ, దేలిక,యొక ప్రాణియిందుఁదెగనేమయ్యెన్.

చ. మును మహిషాసురుం డఖిలమున్ దనపాల్యము చేసి దేవతల్
తన కరి వెట్ట నేలునెడ దౌష్ట్య మడంచి జగన్నియంత్రి యిం

ద్రుని దనభక్తుని న్మనిచెఁ దోరపురాసిరి మెచ్చి యిచ్చి; య
య్యనఘుఁడు కాళి కెన్ని బలు లర్పణఁ జేసి ముదంబు నించెనో. ౯
క. ఒకఁడేఁడు భార్యనే కా, శికకున్ బలి యిచ్చె నిది యశీకము గా దూ
రక చెప్పికొనరు పెద్దలు, సకలేశ్వరికి బలియిడుట శాస్త్రం బొప్పన్.
ఉ. ఇంతకు భాగ్యకాల మది యేర్పడఁ బట్టియె కాళిపూజకున్
భ్రాంతమునంద యీజలజపాణి తలోదరి వారకాంత యీ
చెంతకు వచ్చి నిల్చినది శ్రీ కిది పూర్తిగ సూచకంబ "అ
శ్మంతగృహంపుఁగుండెలు" గదా? యిది యెట్లు సురింగి పోయెడిన్
క. వెనుక "సువుగింజ" సామెత
కనుగుణముగ నర్చకుఁడు గుహాంతరమున నె
మ్మనమున నిటు లుప్పొంగుచుఁ
గనుచుండెన్ స్వప్నరాజ్యగాధాశతమున్. ౧౨
క. నవరాత్రదీక్షతోఁ గడు, నవధానమ్మొప్ప దేవి నర్చించుచు "నీ
కు వలి సమర్పించెద నొక, నవనీతశుభాంగి" నను దినదినం బతఁడున్
గీ. వంగదేశీయు లర్చించువైఖరిగఁ జి
రంబు నుండి యర్పింప నోయంబ? నేఁ ద
లంతు నేఁటికి సిద్ధించె సంతసించి
నన్ను నృపుఁ జేయు మంతియనాకుఁ జాలు. ౧౪
వ. ఇట్లు దురాశాదూషితంబైన మనమ్ముతో నయ్యర్చకుం డంబిక నర్చిం
చుచు మహాష్టమినాఁ డీపె నగ్గుహకు నేకాంతమ్ముగ రప్పించు నుపా
యమ్ము లరయుచుండె నది యటులుండె. ౧౫
ఉ. దానికి నాఁటితిదూరమున దయ్యము గియ్యము లేకయున్న నిం
పైనవనమ్ములున్ సరసు లందములైన గుహల్ ఫలమ్ములున్
దేవియలుం గలట్టి ధరణీధర మున్నది యోగి యొక్కఁ డం
దే నివసించు నైష్ఠ్యఁ దతఁ డెల్లరు నాతని గంద్రు యాత్రికుల్. ౧౬

క. కొంద ఱట కేగుచుండఁగ, సందర్భం బెఱిఁగినట్టి జలజాక్షిం డీ
సుందరి నమ్మూర్తులతో, నందులకున్ బంపి గండ మది తప్పించెన్.

వ. ఆవామాచారుండగు నర్చకాపశదుండు సుశీల యట లేమికి వగచి వేతా
క్కకన్నియం దెచ్చి బలి నీయం దలంచెఁ గాని తుద కయ్యదియు నెఱ
వేఱక ఆత్మవినాశకారణం బయ్యె నది యటులుండె. ౧౮

ఉ ఆగిరి నున్నయోగికడ నంగన లుందురు తత్కృధ్రుగుహా
భాగములందు యోగి యలవారలతో విహరించు సత్యమే
మో ? గనరాదు "యోగు లిటు లుండుటయున్ గల''దంచుఁ జెప్పికొం
డ్రాగిరి కేగి చూచు జను లందఱు: రూపసి యాతఁ డెంతయున్. ౧౯

ఉ. ''ఆతనిశిష్యురాండ్రు ధన మత్యధికంబుగ నున్నవాం" డ్రటం
''చాతని కిత్తు'' రంచు జను లాడుదు రాతనితత్త్వ మెట్టి దో ?
యేతఁడుగాని యొక్కఁడును నించు కెఱింగినయట్లు లేదు దు
ర్నీతియొ ? లేక యయ్యది సునీతియొ ? లోకవిరుద్ధ మెమ్మెయిన్. ౨౦

క. కొందొకబాల్యమ్మున నా, తం డీగిరిఁ జేరి పిదపఁ దత్తద్భూమీ
ఖండముల కరిగి తిరిగియు, నుంఱు నిచటి కేగుదెంచి యోగస్థుండై.

క. అందుఁ గల యంగనలలో హిందూస్త్రీ లొకరె కా దఁ టితరద్వీపా
లందలి స్త్రీలుం గలరఁట? యెందులకో? వార లితనియెడ నిటులుంటల్

క. సామాన్యబుద్ధి కగుపడు. నామాటయె నిక్కమేని యంద తొకనితో
నేమియుఁ బోరపొచ్చెములవి, నా మసలుటయెచ్చటన్ గనంబడదుగదా!

సీ. అల "చిదంబరరహస్యం" బెఱింగినవార
లేరు లే రతనివి లేకి యనుచు
జెప్పుద మన్న దుశ్చేష్ట లింతకు మించి
కనుపట్ట విదియేని కాంచి పట్టి
నట్టివారలును లే రాతండు స్త్రీలును
నగగుహాలో నుందు రంతవట్టె

యే రెఱింగినదేని యెలమి దత్తాత్రేయుఁ
దే కాదు మఱికొంద ఱిద్ధతేజు

గీ. లిట్టివా దున్నయట్టులె యెందు వినికి
యెల్లరును వచ్చి తమ్మాశ్రయింపకుండ
బాలకులవోల్కి వెఱ్ఱులపగిది దయ్య
ములవిధమ్మున నుందురు మును లటంచ్రు. ౨౪

వ. అది యటు లుండె, ౨౫

క. ఆతండును నావనితలు, నీతన్విని దోడివారి నెఱిఁగినయట్టుల్
చేతఃప్రీతికరమ్ముగ, నాతిథ్య మ్మొసఁగి యుంచి రటఁ గొన్నాళుల్.

వ. వారల యాతిథ్యంబు గైకొంచు నచ్చటం గొన్నా ళ్ళుండి యాచుట్టుప
ట్టుల నుండు గిరులయందలి యోగుల దర్శించి వనమ్ముల నీక్షించి సర
స్సులం గ్రుంకి మరల నయ్యెడ కరుదెంచి కొన్ని దినమ్ములుండి పిదప
యథాస్థానమ్మున కరుగు నప్పు డయ్యోగి యిట్లనియె. ౨౬

క. భగవంతుఁడు ని న్నియ్యెడ
కొగిఁ బంపించినది యెందుకో ? యెఱుఁగుదువే ?
తెగ నఱుకఁ దలఁచె నొక్కఁడె
ఱిఁగి యిట్టి యుపాయ మొకఁడు శ్రీహరి సలిపెన్.

ఉ. నీ వట లేమికిన్ వగచి నీచుఁ డతం డలయమ్మవారికిన్
వావిరి వేతొకర్తు బలి వైవఁ దలంచెను గాని యప్పనిన్
దేవుఁడె తా నెటో నిలిపె దీనియథార్థము సర్వ మీపయి
న్నీవును వీరు విందురు మనీషు లటన్ వివరింత్రు కోమలీ ! ౨౯

వ. అని వీడ్కొల్పినపదంపడి యథాపూర్వపర్వతస్థానంబున కరిగి యయ్యె
డ యోగి చెప్పినయావద్రహస్యమ్మును నక్కడి పెద్దలవలనఁ దార్కా
ణం బగుటయు నత్యాశ్చర్యపర్యాకులచిత్తులై వారు నలువురును దమ
లోఁ దా మిట్లు చర్చించుకోఁ దొడంగిరి. ౩౦

చ. ఉనికిని బట్టి చూడ నొకయోగిగనే కనుపట్టుఁ గాని జ
వ్వన మలరారు భామినులు పజ్జనె యుండఁ గుభృద్గుహాస్థలం
బునఁ జరియించు పేరికిని బుట్టఁగఁ జేసెడి సందియంబు; చీ
నినిజ మెఱుంగు పెంతటి మనీషులకేనియు దుర్ఘటంబ యౌ. ౩౧

క. జ్ఞాన మసామాన్యం బను
కో నగుఁ గాకున్న నిచటిగొడ వెటు తెలియం
గా నయ్యె "రేడియో" వలెఁ
గానఁగ యంత్రమ్ము యోగికడ నున్నదియే ౩౨

వ ఇక్కడివా రెవ్వరేని యక్కడికి వచ్చి యిక్కడి వృత్తాంతమ్ము నడివి రనుకొనుటకును నవకాశం బగుపట్టదు. అక్కడ మన మున్న దినమ్ములలో నిక్కడనుండిగాని వేఱొకచోటినుండిగాని యెవ్వరును వచ్చినట్టు లగుపట్టదని వెండియు. ౩౩

సీ. దూరశ్రవణశక్తి దూరదర్శనశక్తి
యోగులకున్నట్టు లొక్కకొన్ని
దృష్టాంతములవల్లఁ దెల్లమయ్యెడి నది
యోగసాధ్యం బని యోగవిదులు
వల్కుదు, రిప్పుడో ? పరఖండవాసు ల
ద్దానియంత్రింపుబలాన నోలి
సర్వసామాన్యమౌ సరణికిఁ దెచ్చిరి
గాని మాంత్రికశక్తి కష్టసాధ్య

గీ. మద్ది యీయంత్రములబలె నన్యవస్తు
తతుల సాహాయ్యమును గోరఁ దలఁప దిదియె ?
కోరు నితరసాహాయ్యము, కొసకు దాన
నేది చెడెనేనిఁ జెడు, మంత్ర మెపుడుఁ జెడదు. ౩౪

ఉ. యాంత్రికశక్తి చేయఁగల మర్మము లన్నియుఁ గాకపోయినన్
యాంత్రికశక్తి కొన్ని పనులైనను సల్పుట యక్కజంబ యౌ
మంత్రి మటంచు లే దనుటమాత్రము తప్పగు దీనియున్కి "రై
ల్మంత్రము"వల్లఁ దెల్లమగులా గొనరించె నయుం డొకం డహో ?

వ. ఇయ్యది యనేకు లెఱింగినదియ. సర్పదష్టునిపేరు చెప్పి తంతి నంపిన వెంటన యెన్నివేల మైళ్ళలో నుండినను నటనుండి మంత్రించి బ్రదికించుట ప్రత్యక్షమ్ముగ నీకాలపువారలెల్ల నెఱిఁగియు మంత్రశక్తి లే దను కొనుటెట్టిది ? ఇట్లు వారిలో వారు నలువురును నావైశ్యయోగిశక్తిం గుఱిచి వితర్కించుకొనిరి వారిలో వైశ్యవృద్ధుండు తన యెఱిఁగిన యొక యోగిచరిత్ర మిట్లు వక్కాణించె. 3ట

క. ఒకయోగి వచ్చె మును మా, మకపురమున కతని ననిరి 'మాలం'డని పా
దుకలును దండము వస్త్రం, బొకటియ సామాగ్రియతనికున్నసకలమున్

వ. అన్నముగాని పాలుగాని యతఁ డెన్నఁడును ముట్టినట్లు లేదు మలమూత్ర విసర్జనంబున కరిగినట్లును లేదు. పుడిసెఁడు పలుచని మజ్జిగయును నొకయరఁటిపండులో సగమునుమాత్రము దినమున కొకసారి పుచ్చుకొను నింతకు మించి యేమియున్ దినఁడు కడుంగడుఁ గృశించి యుండెడివాఁడు. సర్వరోగములను "రెట్టియా పట్టిచామి" యనుమంత్రముపదేశించి పాఱఁదోలెడివాఁడు. ఇట నేను బ్రత్యక్షమ్ముగా వీక్షించితి. నతనికడ కరుదెంచు రోగులకతన మాపురంబు జనసంకులమై పట్ట శక్యము కాదయ్యె నప్పు డతనిని రాజశాసనం బవలికిఁ బంపె. యోగులు ప్రచ్ఛన్నలుగనో ? యేదేని యితరవిధముగనో యుండవలయునే కాని కానున్న జను లవ్వారిసమాధికి భంగంబు గల్గింతు రనుటకు సందియము లేదు. నేను జెప్పినయోగి యెక్కడి కేగిన నక్కడికే జనులు తండోపతండములుగా వెంటాడి పీడింప నతం డెక్కడనో యొకట నంతర్ధానము నందినట్లు చెప్పికొనిరి. వేఱొకయోగి కడుంగడుఁ జక్కనివాఁ

డు నవయౌవనుఁడు జన్మమ్ముచే శ్రీవైష్ణవుండె యయ్యు సుబ్రహ్మ జ్యోపాసకుం డతనికిఁ దోఁచి యేపుష్పమేని యొసఁగినచో నది ధరిం చుమాత్రన వ్యాధి నిర్మూలం బయ్యెడిది, కొందఱ కట్టి యుపకృతి జరి గినపిమ్మట నయ్యది సర్వత్ర వ్యాపించుటయును. ౩౮

క. దగ్గెడివారును జ్వరమున, గ్రుమ్మెడు వారలును మఱియు మఱియేరుజనో నగ్గెడివారును నాతని, దగ్గఱ కేతెంచి రతఁ డెదన్ విసిగికొనన్. ౩౯

వ. తుద కాతండును నెట్టకేలకుఁ దప్పించికొని సురిఁగె ననవుడు రాజర్షి యీయోగులచరిత్రములు నానాప్రకారంబులుగా నుండు వానిని గ్రహిం చుట కష్టసాధ్యము, మఱియుం గొన్నిటి కర్థమే కనుపట్టదని వెం డియు. ౪౦

ఉ ఈతనిచర్య హేయముగనే కనుపట్టెడి, స్త్రీలపొత్తు లో
కాతివిరుద్ధ, మంగనలయం దనురక్తియ యుండెనేని యీ
రీతిగ నుండి వారి నలరించుటకంటె మఱొండు వేషమే
ప్రీతికరంబు గాదె ? అలభీతమృగేక్షణజాతి కారయన్. ౪౧

వ అట్లనుకొనుటకును వలను పడదు సుభద్ర నర్జునుండు వలపింపఁజేసినది యోగివేషంబుననకదా ? ౪౨

ఉ. కొందఱతత్త్వమున్ దెలిసికోవలె నన్న వశంబు గాదు బల్
సుందరుఁ డొక్కరాజు పరిశుద్ధుఁడు విద్యలయందు నెందు సం
క్రందనమంత్రి సత్కవియు గాయకుఁ, డాయనవంటివాఁడు ము
న్నెందు జనింపలేదు జనియింపఁడు రాఁగలకాలమం దెటన్. ౪౩

ఉ. భోజుని విక్రమార్కునిఁ "బ్రభూతయశస్కు" లటంచు విద్యలం
"దోజగలా" రటంచు వినుచుందుము వారలశక్తి యీమహా
రాజవరేణ్యుశక్తికడ రాజిలు "కాగడముందు దీపపుం
ధేజునుగాదు" మెచ్చఁదగు తేఁకువలెల్ల వరించె నీతవిన్. ౪౪

ఉ. క్షత్రియుఁ డాతఁ డేను నొకక్షత్రియమాత్రుఁడ నక్కతంబునన్
స్తోత్రము చేయుచున్నటులు దోఁచుచునున్నది యేమొ? మీకు సు
ర్వత్ర జగంబునం దతని రాజులునున్ గవిరాజులున్ యశో
గాత్రుని నేఁడునున్ విరివిగాఁ దలపెట్టుచునుందు రెల్లరున్. ౪౭

సీ. "ఔదార్య" మన్నప్పు డతనిదే యౌదార్య
మనఘత్వ మన్న నాతనికె చెల్లు
నలఘుత్వ మన్న నాయనదియే యలఘుత్వ
మనుపమత్వ మ్మన్న నతనికె తగు
నప్రమేయుం డన్న నతనినే యను టొప్పు
నపరిధృష్యుం డన్న నతఁడె యౌను
అకలంకుఁ డన్న నాయనఁదక్క లేఁ డెందు
ననుకంప యన్న నాతనిధనంబు

గీ. రసికుఁడన నాతఁడే యథార్థవిదుఁ డన్న
నతఁడె భోగియు యోగియు నతఁడె త్యాగి
వైణికుఁ డతండె గాయకవరుఁడు నతఁడె
ధీయుతుఁ డతండె శృంగారనాయకుండు. ౪౮

గీ. వైదికాచారతత్పరత్వమున మాతృ
పితృచరణభక్తి సత్యసంధతను నేక
వీరతాగుణమందు నీధీరు ముందుఁ
జెప్పి శ్రీరాముఁ బిమ్మటఁ జెప్ప నొప్పు. ౪౯

గీ. ఎంత వర్ణించినను దృప్తి యించుకంతఁ
గూడఁ గలుగ దిమ్మహితుని గుణగణంబు
స్వయముగా నేను జూచినవాఁడ నొరుల
వలన విని యిట్లు వర్ణించువాఁడఁ గాను. ౫౦

ఉ. ఆయన కుండె నంక మొకఁ డంబుజపైరికి నేఁ బోలె, దాని
సీమెడఁ బొల్తనే నుడువ నీరు తదీయకథానురక్తికిన్
"బాయుదు రేమొః" యన్ భయము పట్టి ననున్ వెనుదీయఁ జేయుటన్
నామెద డాఁచి పెట్టితి ననంతరమం దెటు డాఁగు డాఁచినన్. ౪౯

సీ. ఈయకే ఏోవలె నిచ్చుచో దర్శనం
బది యెల్లకాల మిం కద్దు వడదు
ఉద్యోగ మొకసారి యుండి పోయినయేని
నెలజీత మది ముట్టు నియతముగను
అవశమై యున్నప్పు డాడినమాటేని
జరిగి తీరుచెకాని యురక పోదు
తనతండ్రినాఁటిది తనకమే యగుఁగాక
అదియు గౌరవపాత్ర మతని కగును

గీ. మఱియు నెన్నియొ గల వసామాన్యములగు
గౌనము లాయనయెడ నందుఁ గొన్ని మనకు
నర్థమే కావు, కాక యన్యార్థ మిచ్చు
నంతటి విశాలహృదయ మెట్లబ్బు మనకు. ౫౦

క. సామాన్యులతెల్వికి ను, ద్దామచరిత్రుల యథార్థత నెఱుంగు బలం
బేమాత్రము నుండదు త, త్సామర్థ్యము దెలియ నట్టిసారము వలయున్

గీ. "తల్లి పట్టాభిషేక విధానము నకు"
నాజ్ఞ యీకున్నఁ దలపెట్టఁ డయ్యె మరలఁ
గారణము కోడలికి నత్తగారు గౌర
వంబు చూపుచు మెలఁగఁగా వలయు ననుచె. ౫౧

గీ. ఇది సదుద్దేశ మనుకొని యేకుమారుఁ
డన్వయపరంపరగ వచ్చునట్టి యుత్న

వంబు విరమించు నిట్టివి పదియు నైదు
గా వతనిసద్గుణము లనేకములు గలవు. ౫౩

క. ఏతల్లిమాటయెడ నే, భూతలపతి యింత భక్తిఁ బూని చరించెన్
సీతాపతి తండ్రికిబలె, నీతఁడు తల్లికి మెలంగె నెదు రన కెపుడున్.

క. పార్థివుఁ డాతం డెపుడుం, బార్థివలింగార్చనంబు మానఁడు కృష్ణున్
బ్రార్థించుటయును మానఁ డ, నర్ధమ్ముల కాతఁ డెట్టు లాస్థాన మ్మో.

చ. పరమపవిత్ర మన్వయము భాస్కరతేజమువంటి తేజ మీ
శ్వరపదనిత్యపూజనము స్నానము సందెయు లోనుగా సదా
చరణము విప్రభక్తి తొలిక్షత్రియు లేగినవర్తనంబు నే
మఱక చరించు నీతనికి మద్య మెటుల్ రుచియించెనోకదే! ౫౬

చ. అనియనుకొందు నిప్పటికి నాయన జ్ఞప్తికి వచ్చినప్పుడె
ల్లను నిది యబ్బుకారణము లాఁతివిలాతులనుండి వచ్చి యీ
మనకుఁ బ్రభుత్వ మూను జనమాన్యుల "విందుల కేగుటే" యటం
చనెదరు గాని కొంద; అది యన్యనృపాలుర నిట్లు చేసెనే? ౫౭

క. ఈయనతో మఱికొందఱు,
శ్రీయుతు లుద్యోగిజనులు శిష్టులు సుకవుల్
గాయకులును గాయనులును
సాయముగా నుండి క్రోలసాఁగిరి రసమున్. ౫౮

క. ఎంతెంతొ విలువ గల రస, "మంతును బొంతు"గనరాక అగత్యమై 'రా
జ్యాంతే నరకం ధ్రువ' మని, అంతు లిడం జేసె జనపరంపరచేతన్.

గీ. త్రాగుఁగాక మద్యమ్ము విస్తార మధిపుఁ
డెవఁడుఁగాని పరుషమాడఁ డెపుడుఁగూడఁ
జేయఁ డవమతి మఱవును జెందఁ డిట్టిఁ
డొండొకఁడు మద్యపులయందు నుండు టరిది. ౬౦

క. పంచమహాపాతకులం, దెంచిరి మద్యమ్ముఁ ద్రావు నెవ్వని నటు వా
రెంచుటకుంగలకతమిది,మంచిసమస్తమ్ము నణఁచి మనుజుని జెఱుచున్.

గీ. అట్టిదుర్దోష మీయనయందు లేశ
మేని గలిగింప లేదని యేన కాదు
ఎల్లవారు నెఱుంగుదు రల్లశంక
రార్యుఁడో ? యీతఁ డాతనియంశ మగునొ ? ౬౨

వ. అది యటులుండె. ౬౩

ఉ. ఏగెను జాలఁగాల మిటు లీయొకయంకము దప్ప లోప మే
భాగమునందు లేకయలపార్థివసత్త్వము జీవితంబు, పై
కేగెడికాల మయ్యలఘుఁ డెట్టు లెఱింగెనొ ? గుర్తు వట్టి య
య్యాగమవేది తా నరిగె నాప్తులతో దరి సున్నకొండకున్. ౬౪

ఆ. ఏగుత్రోవ మద్య మెదురయ్యె వారికే
నధిపుఁ డల్లజనుల నడ్డఁ బనిచి
కావడులను గొండకడ కేగునట్లుగాఁ
జెప్ప నాజ్ఞ చేసె సేవకులకు. ౬౫

ఉ. అక్కజ మయ్యెఁ జిక్కిఁ గలయాప్తుల కయ్యధినాథుఁ డప్పు డా
ఫక్కిని జేయునాజ్ఞ ! మధుపాయులై యయ్యును వార లెంతయో
చక్కని మేల్పరీమళ మెసంగురసంబులు గోరిలువారు నేఁ
డిక్కటుమద్యమున్ గొనెడి యిక్కటు వారల కెట్లు సొక్కెడిన్.

క. యోగీశ్వరోత్తముండున, నాగతవేది యగుజ్ఞాని యయ్యధిపతి యీ
పైఁ గటుమద్యమె"వారల, కౌగతి"యనియెంచి యట్టిశాసతియిచ్చెన్.

వ. ఈతకల్లు కావళ్ళు కొండకుఁ జను నట్లాజ్ఞాపింపఁ బంచి యన్నరవ
రుండు. ౬౭

క. చర్మములు బాగు చేసెడి, మర్మ మెఱుఁగనట్లె దీవి మర్మముగూడన్
దుర్మతు లెఱుంగ రిదియే, మీ ర్మేమును ద్రావుచుంటిమి జడాత్ములమై.

గీ. పుట్టినది పుట్టిన ట్లున్నపుడు మన కిది
యేవముగఁ దోఁచు నిది కాఁచి యేదొ కలిపి
కాచపాత్రల కెక్కింపఁగా సురేంద్రుఁ
"డమృత మంపించె" నని క్రోలుదుము భ్రమించి. ౨౦

వ. ఇట్లర్థోక్తిగాఁ గొందొక సూచించి తేఁడు మిన్నకుండె. ౨౧

క. అలవాటు పడిరి వారలు, కలిమికి నెలవైన నృపతికడ మేల్మిపరీ
మళ మలరువిలువమద్యము, లలఘుండతఁడేగుకాల మది దరియయ్యెన్.

ఉ. ఈవిషయంబు వా రెఱుఁగ రించుకయు న్వెసఁ బూర్వమున్ బలెన్
శ్రీ వెలిఁ బుచ్చుతే జొలయఁ జెల్వలరారెసి తేజి నెక్కి ఆ
భూవరుఁ డేగుచుండె నలభూధరకూట, మతండుమాత్రమే
భావమునం దెఱుంగు నలభావము వారి కెటుల్ స్ఫురించెడిన్. ౨౩

వ. అయ్యెడ మిక్కిలి నాంతరంగికులు గొందఱు. ౨౪

ఉ. ఏమి? మహాప్రభూ? ప్రళయ, మిట్టు లొనర్చితి రాజ్ఞ నెవ్వ రీ
పామరు లౌను నీతకలు పానము చేయఁగలట్టివారు? సు
శ్రీమహితంబులై తగు పరీమళముల్ దెస లావరించు ను
ద్దామపు "పైను" లున్నవిగదా? మన కేమిటి కిద్ది దేవరా? ౨౫

వ. నావుడుఁ జఱునవ్వునవ్వియువ్విభుండిట్లను, సృష్టిస్థితిలయంబులొనర్చు త్రి
మూర్తులుగాని లెక్కలేని రిక్కలఁ జక్కఁగాఁ బ్రకాశించు నాకాశంబు
గాని భూమిగాని పర్వతంబులుగాని యవి యివి యననేల? యేదియు
శాశ్వతంబు గాదు కావున నెవఁడుగాని దేనికిఁగాని యొకనిపై నాధార
పడి యుండరాదు స్వతంత్రజీవి సర్వథా ధన్యుండని వెండియు. ౨౬

ఉ. పోయిన దట్టికాల, మిఁక ముం దిదియే గతి మీకు, నన్ను సు
శ్రీయుతు నాశ్రయించితిరి, చెన్నఁటిదోసము నాకతాన మీ
యాయువు నాశ్రయించినది, "అంతట వింతటఁ దీఱునట్టిదా?
భూయుషు" మంచు నాహృదయ మిప్పుడు కొందల మందఁ జొచ్చెడిన్

వ. అని మిన్నకుండె. సతిగంభీరంబులగు సద్వచనంబులయందలి యర్థం
బు గొండొక గోచరించియు నయ్యది త్వరలోనే జరిగెడిది కాదనికొని
వారలు లోలోఁ గొంత చింతిల్లియు నుపశమిల్లిరి పిమ్మట నన్నరపాల
మౌళియు. ౭౮

మ. పిలిపించెం బురమందు నెందుఁ గలరోపూఁబోఁడులన్ "వేడుకల్
దొలుకాడన్ మల కేగుదేవలయు నేదో? యుత్సవం" బంచు, న
ప్పలుకుల్ వింట యొకండె తాఁ దడవుగాఁ బర్వెత్తి రాప్రోలివే
శ్యలు, సాలంకృతు లౌచు గుంపులుగ నాశైలేంద్రకూటానకున్. ౭౯

వ. అట్లు వచ్చినయచ్చేడియల నెల్లరం దనయాప్తులకుం జూపి యారాజేం
ద్రుండు. ౮౦

శా. మీలో నచ్చినదాని నొక్కరొకరై మీ రేరికొం డోలి నీ
బాలాసంఘమునందు, నచ్చునిచెలి న్వర్జింపుఁ డన్నంత వా
ర్చాలన్ లోఁ జలియించు చొక్కొకకనచ్చామీకరాంగిన్ గొనం
గా లజ్జించియు స్వీకరించిరి నృపాజ్ఞన్ దాఁట రాకుంటుటన్. ౮౧

ఉ. అందఱు నేరికో మిగిలె నందొక రోచెలి యందకత్తె గా
దెందును జాణ గాదు నగ లేమియు లే వలలేమ నానృపా
లేందుఁడు తా వరించెను నదృష్టము పండి; త్రుటిన్ ఘటించె సం
క్రందనుసానికిం గలుగురత్నపు భూషలు మేల్మిచీరలున్. ౮౨

ఉ. అందముఁ జందమున్ గలుగు నంగనలన్ సిరి చెందుఁ దక్కువా
రిం దరిఁజేర దందురు, పరీక్షగఁ జూచిన నెందఱెందఱో
యుందురు రూపహీనలగు నుగ్మలు, లంగము రత్నభూషణా
మంద "నిగన్నిగన్నిగల" మాటున డాఁగెడి వార లెల్లెడన్. ౮౩

చ. అతిగఁ బరీక్షసేయ సిరి కందము హేతువు గాదు మేల్గుణ
ప్రతతియుఁగూడఁ గాదు భగవత్కృపయే పరమార్థ, మిష్ట భూ

పతికరుణన్ ద్రుటిన్ సిరికి భాజనమైన వెలందివల్లఁ బ్ర
స్తుతసువిశేషమెల్లరకుఁ దోఁచెడి గోచర మౌచు నూటిగన్. ౫౪

వ. పాండ్యమండలమ్మునఁ గడుంగడు బీదకుటుంబంపు ద్విజుం డొక్క
రుండుండువాఁడు వైదికవిద్యయందుఁగానిలౌకికవిద్యయందుఁగాని య
తనికి లేశంబును బ్రవేశంబు లేమింజేసి యేపూట కాపూటయే గడచుట
దుర్ఘటంబుగా నుండెడిది, అతనికిఁ బలువురు బిడ్డ లుండిరి, అతనియ
వస్థ వర్ణనాతీతం బగుటచే విస్తరింప నక్కఱ లేదు. ౫౫

క. ఆతఁడు జమీను కధిపతి, దాతయునై యెల్లసిరులు తన్నుఁ గొలువఁ బ్ర
ఖ్యాతి గడియించె నన నే, వాతులుఁడు న్నమ్మఁ డింత వాస్తవ మయ్యున్

క. ఇచ్చిరి జమీనుదారులు, వచ్చి కొమార్తల నతనియపత్యమునకు వే
ల్లిచ్చులు కట్నము లిడి యే, సచ్చరితముఁ జూడ కొక్కసంపదఁ గనియే

గీ. జనకుకాలమ్ము చక్కఁగా జరిగె నంతఁ
గొడుకులకుఁ బెత్తనము వశపడియె నొకరి
కొండొకరికిని బడదయేఁ బెండు వడఁగఁ
దొడఁగె సంపద క్రమముగా బడుగులైరి. ౫౮

క. 'చాపచిరిగినను జరరకు, లోపం బుండ' దని యంద్రు లోకులు పిదపన్
సాపాటుకు నెల్లెట్లో, లోపము లేనంతకల్మి లోనికి దిగియెన్. ౫౯

క. ఆగర్భదరిద్రున కెటు, రాఁగలిగె జమీను, పిదప రాచటిక మెటుల్
పోఁగలిగె సుతులతరమున, శ్రీగొన మిటువంటి దనుచుఁ జెప్ప వశంబే?

వ. అదియటులుండెఁ బ్రస్తుతచరితంబు వినుఁడు. ౬౧

ఉ. వేలకు మించువిల్వ గల వింతనగల్ మెయినిండఁ దాల్చి య
వ్వాలిక గుల్కఁ జూచి యలవారమ్మగినయనల్ పొరింబొరిన్
మాలిమి నామెఁ గాంచు చలమానిని నోఁచిన నోము మెచ్చికొం
చాలలనామణిన్ గొలిచి రాచెలి రాచెలియై రహించుటన్. ౬౨

ఉ. అక్కడివారి కెల్లరకు నక్కజమున్ గలిగించె రాజుగా
రిక్కలికిన్ వరించుటయు నిందఱ నిందఱతోడఁ గూర్చుచొ
ప్పెక్కడ నెన్నఁడుం గనని యీవిషయంబున నున్నభావ మే
యొక్కరుఁగూడ "నిట్టి" దని యూహ యొనర్పఁగఁ జాలరై రొగిన్.

వ. అయ్యెడ నక్కడిరాజమిత్రులు తమలోఁ దా మిట్లు చర్చించుకోఁ దొ
డంగి రఁట. ౯౪

క. "ఆనందో బ్రహ్మ" యటం, చానాఁడు వరూధిని "విషయానందమె బ్ర
హ్మానంద" మనియె విజ్ఞుం, డీనృపతియు దాని నొప్పునే? యిది సతమే?

క. తలిరాకుఁ బోండ్లకలయిక, వలనిసుఖంబునకు నల్లబ్రహ్మానందం
బిలఁ దులగాఁ జెప్పియుఁ 'జం, చల' మని నిరసించి రవల శాస్త్రజ్ఞాతల్.

ఉ "తా దివ మేగుకాల మది దాపుగ నున్న"దటంచు నిప్పుడే
కాదె వచించె? నిట్టి తుదికాలమునందు 'ధనాంగనాజనా
స్వాదన మిచ్చగింపఁ డెటువంటి కుశీలుఁ' డనంగ విజ్ఞులో
కాదరణీయశీలునకు నట్టిప్రవృత్తి జనించు టొప్పునే? ౯౭

క. పరిపూర్ణప్రజ్ఞాబం,ధురులగు వారలచరిత్ర తుచ్ఛాత్ముల కె
వ్వరి కర్థంబగుఁ దాదృ,క్పరిపూర్ణులె వ్యాకరింపవలయున్ దానిన్. ౯౮

వ. కేవలకామప్రయుక్తం బనుకొంద మన్నను. ౯౯

మ. అగుఁగా కిందఱి కిందఱిన్ గలిపి యేయానందమున్ దాను బొం
దఁగ నూహించెనొ? ఆటపాటలకు నీదాంపత్యబంధమ్ముతోఁ
దగు లేముండెడి? నంతరార్థ మెదియో? ధాత్రీశుఁడే తప్పఁ జె
ప్పఁగలే డైవ్వె కిది యర్థశూన్యముగఁ గన్పట్టున్ రసాభాసమై. ౧౦౦

వ. అని మఱియును. ౧౦౧

చ. ఇపు డిది యర్థశూన్యముగనే కనుపట్టునుగాక దీన గో
ప్యపువిషయం బెదేని యొకఁ డద్భుతమైనది యుంట నిక్క మే

పఫుఁడని కీఘనుండు తనస్వప్నమునందునుగూడ నొప్పఁ డీ
కృపణత కిప్డు దొప్పెడినె ? కిన్నరపాలుఁడె ? యీతఁ డక్కటా ?

వ. అని యనేకప్రకారమ్ముల నెవరికిఁ దోఁచినతెఱంగున వారు తమలోఁ
దాము వితర్కించుకొనుచుండిరి. పిమ్మట నన్నరపాలుండు వారలం
గాంచి. ౧౦౩

మ. మన మీనాఁ డది యాది కృష్ణుని యసామాన్యంపుఁజర్యల్ నటిం
చి నటాగ్రేసరుఁడైన యప్పరమునాశీస్సుల్ గొనంగా మనం
బున నుత్సాహము పుట్టెఁ, దచ్చరితము ల్మన్నీరు వల్లించి యా
డినవే, యీవెలయాంధ్రు గోపికలమాడ్కిన్ గ్రొం ద్రిటన్ భూమికల్

క. అవతారము లున్నవి శ్రీధవునివి పెక్కేది యొసఁగెఁ దాదాత్మ్యముగో
పవధూటులకును గోవులకవనిన్ గృష్ణావతార మది యొకటి వినా.

ఉ. స్నానము సంధ్యయున్ జపము సల్పి విరక్తి గడించి మోక్షసం
స్థానము నొందుటన్న శ్రమసాధ్యము, జారత కగ్గమై రమా
జాని నెఱింగకే అతని జారునిగాఁ దలపోసి మోక్షసం
స్థానము కొల్లగొట్టు వ్రజతన్వుల నోఁచిన నోము లెట్టివో. ౧౦౫

మ. పరకీయాంగన కబ్బు ప్రేమ మది పాపప్రాపకంబైనఁ ద
త్పరతంబట్టి విమర్శ చేసినయెడం దత్తుల్య మొం డుండ, ద
త్పరమాత్మ్యం దొకజారుభంగి నలగోపస్త్రీలకుం దోఁచుటల్
పరమాదృష్టమొ ? దానిపే రెదియొ ? చెప్పంగా వశం బేరి కా ?

ఉ. ఈతఁడు ముక్తి నిచ్చు "పరమేశ్వరుఁడే" యని గోపికాంగనల్
చేతమునం దెఱుంగునెడ శ్రీహరిపై వల పంత మ్మక్కరం
బై తెగఁదెంపు లేక విరహాసహమై విలసిల్లునే ? మనః
ప్రీతికరుండు జారుఁ డనుప్రేమదీ తారక మయ్యె వారికిన్. ౧౦౭

క. జారునిపై జారిణికిన్, జారిణిపయి జారునకును సాఁగెడిరతి శృం
గారమునకు జీవం బా,జారుఁడు పరమాత్ముఁ డెట్టి సంఘటనంబో ?

క. నదిలో వర్షించిన వృష్ట్యుదకముగతి గొల్లసతుల యుద్రేకము కృ
ష్ణుఁ దవిలి సద్గతి నిడె ని,మ్మద మితరోద్దిష్ట మబ్ధి మణఁగెడి జలమౌ.
ఆ. నీటిగుణ మొకొక్కచోటిగుణముఁబట్టి
మాఱినట్టి ప్రేమ మాఱుచుండు
నొక్కప్రేమ ముక్తి నొసఁగు వేఱొకప్రేమ
నరక మొసఁగు నెఱిఁగి నడువవలయు. ౧౮౧
వ. ఇది యింకను విచారణీయంబు, భగవద్గుణానుభవం బెవ్విధమ్మున ల
భించినను నయ్యది తరణోపాయం బగు ననునది భాగవతంబువలనం
దేలెడి సారం, బని వెండియు. ౧౧౨
మ. నదు లెన్నేనియు నుండుఁగాక జగదానందానుసంధానసం
పద సొంపారెడిః నచ్యుతామలపదాబ్జాతద్వయీ రేణువి
ర్యదఘాంకూర వినీలవర్ణదమృతప్రాయ ప్రవాహచ్ఛటా
స్పద శ్రీమద్యమునానదీమణితులన్ బ్రాపింపఁగా నేర్చునే ? ౧౩౦
శా. శ్రీకృష్ణుం డవతార మెత్తనియెడన్ శృంగార మేకానలో
నేకోనం బడి నగ్గి మగ్గి యసద్దై యేకాంత మెట్లుండునో ?
నాకౌకస్సరసీరుహాక్షులకడన్; "నారాయణుం డీరస
ప్రాకట్యమ్మున కెత్తఁబోటు నవతారం" బంచు నే నెంచెదన్.
ఉ. ఏరసముం గుఱించి కవి యేరచనన్ బచరించెనేని శృం
గారరసాంగ మైనపుడె అయ్యది తియ్యగనుండు భోజరా
జేరస మొప్పికోక "యొకఁడే రస" మంచు వచించె నట్టిశృం
గారరసంబు గోపికలయం దుదయించి ఫలించెఁ గృష్ణుచే. ౧౧౫

2వ చరణములో – 'శృం।గారరసాంగ మైనప్రుడె కమ్మఁదన మ్మొదయించు' ననియు, 4వ చరణములో — గోపికలకాయములందు ఫలించెఁ గృష్ణుచే. ననియుఁ బాఠాంతరము.

ఉ. వృద్ధులునైత మీరసము పీడియుఁ బూర్తిగ పీడనొల్ల ర
 శ్రద్ధ నటించినం బయికి స్వాంతమునందుఁ బురానుభూతముల్
 పద్ధతులెల్ల నిల్చి రసభావముల న్నెగడించు నీ రసం
 బిద్ధరకెల్ల మూల మని యెల్లరు నొప్పుదు రింత యేటికిన్. ౧౧౮

క. భక్తులలో శృంగారపు, భక్తియె తారకము పల్లవకులం బెల్లన్
 ముక్తిగనె దీనికతమున, వ్యక్తం బగు నిదియు భాగవతమునయందున్.

క. శుకునితరువాత రెండవ, శుకుఁడని వినుతింతు రెవని సూరులు లీలా
 శుకుఁడును శృంగారపుభ, క్తికతననే ముక్తి గాంచెఁ దెలియునకాదే?

ఆ. "దేవుఁ" డంచుఁ దెలిసి సేవించు యోగులు
 సద్గతులకుఁ జనుట శాస్త్రహితమె
 "జారుఁ" డనుచుఁ దన్నుఁ జేరిన వెఱిగొల్ల
 యాండ్ర కిచ్చె ముక్తి నచ్యుతుండు. ౧౧౯

శా. 'గొల్లల్ గొల్ల' లటన్న గొల్లలటె? ఆగొల్లల్, తదీయాంగనల్
 ఫుల్లాంభోరుహలోచనల్ మృదుతనుస్ఫూర్తుల్ కనత్కాంతివి
 ద్యుల్లేఖల్ కరిరాజమందగతు లిందుభ్రాజదాస్యల్ సుతా
 ర ల్లీలావతు లేల వేయిపలుకుల్ రంభోర్వశీమేనకల్. ౧౨౦

వ. ప్రకృతము వక్తవ్యం బేమన. ౧౨౧

మ. మన మాగోపవధూమణుల్ హరియు నేమాడ్కిన్ రహిన్ బృందికా
 వనమందున్ వనమందు వర్తిలిరొ? తద్భావమ్ములన్ స్వాంతమం
 దున నేకాగ్రత నిల్పి తచ్చరితమందున్ రక్తి గీల్కొల్పి యిం
 దనువర్తింతము మూఢభక్తిమెయి ముక్త్యర్థంబు నేఁ డిగ్గిరిన్. ౧౨౨

చ. ఇది మొద లేరు మీరు హరి నేమఱకుందురుగాక! గోపికా
 హృదయములట్ల మీమదులు శ్రీపతియయ్యవతారమైన శ్రీ
 యదుకులనాథుపై నిలుచునట్లు యతింతురుగాక యెట్టికో
 విదులకు వందరానిపదవిన్ విభుఁ డిచ్చునుగాక వీఁకమై. ౧౨౩

వ. అని వెండియు. ౧౨౪

ఉ. ఇచ్చకు వచ్చినట్లు తినుఁ డిచ్చకు వచ్చినయట్లు గ్రోలుఁ డీ
రిచ్చపలాశులన్ మెలఁగుఁ డిచ్చకు వచ్చినయట్టు లిగ్గిరిన్
ముచ్చటకైన మద్యమును ముట్టఁకుఁ డీపయి, నొట్టు వెట్టికొం
డిచ్చెడువస్తు వొక్కటియె యెట్టివివేకిని మట్టువెట్టెడిన్. ౧౨౫

సీ. తలిదండ్రులను గొట్టు ఖలులు భార్యలఁ బట్టి
మర్దించునట్టి దుర్మదులు పడపు
చెలులఁ గూడెడి చెనంటులు కన్నములు వేయు
మొఱకులు జూదముల్ మరగు జడులు
పూజ్యుల నవమానముం బొనర్చెడి మొద్దు
లపమృత్యువుల కగ్గమగు నలసులు
"బొడ్డున మాణిక్యమును బెట్టిపుట్టి" అ
న్నము రామచంద్ర ? యన్ కుమతితతులు

తే. యమపురిని 'గ్రొత్తనరకము లవసర' మని
పించెడి ప్రబుద్ధులెల్లఁ బ్రపంచకమున
మద్యమున కలవడి చెడు మనుజులని యె
ఱుంగఁదగు దీనిబారిఁ బడంగఁ దగదు. ౧౨౬

గీ. ఏనుదక్క మాకొలమున నింతవఱకు
దీని కలవాటు పడినట్టి దృష్టులు జని
యింపలే దొక్కసువిశేష మిది మరగియు
నే నొకయకార్యమును జేయ నెఱుఁగు జగము. ౧౨౭

ఉ. చేసినఁ జేసినట్టె మఱి చేయకయున్నను జేసినట్టె యో
దోసము, లాసవంబునకు దూరముగాఁ జరియింపకున్నచో
గ్రాసము లేక కుందుటయు గాసిలి గ్రుగ్గుటయున్ దటస్థమౌ
నాసహవాసులార ? యిది నాకతనన్ ఘటియించె మీకొగిన్. ౧౨౮

శా. ఏ నెల్లప్పుడు శాశ్వతం బగుదునే ? యీవేళనో రేపొ ? కా
దేనిన్ వచ్చెడియేఁడొ ? యెప్డొ ? చనుటే యేలాగునుం దప్ప, దా
పైనేనిన్ దృజియించితీరవలె నీపాపిష్ఠపున్ వస్తు వి
ట్టే నే నుండఁగనే త్యజించునెడ నా కెంతేని సంతోషమౌ. ౧౨౯

క. ఏకులమునకును నియ్యది, తాఁకంగారాని చెడుపదార్థము ద్విజులన్
వాకొనఁగనేల ? సాక్షి,శ్రీకృష్ణునియన్నగూడఁ జెడె నిక్కతనన్.

మ. బలరాముం డలశేషునంశముగదా ? ప్రాజ్ఞుండు హాలాపరీ
మళ విస్మారితచిత్తుఁడౌ కతన నమ్మాన్యున్ గురుం జేసి పు
త్రులునుం బౌత్రులు నెల్లవారుఁ దుద కీదోషానకున్ బాత్రమై
ఖలులై ప్రగ్గిరి మూలముట్టుగ సురాకాలుష్య మింతింతయే. ౧౩౧

వ. దీనిం బూర్తిగ వర్జింపవలయునని దైత్యగురుండు శుక్రుండు శాసించెం గాని యాశాసనం బేకొలఁదిమందియోగాని యెల్లరు నామోదించిన ట్లగపట్టదు. భావికాలమ్మునవేని యెవరెన్నివిధముల యత్నించినను దీనిప్రచారంబు మూలముట్టుగ నాఁగుట కలలోనివార్తయే యని వెండియు,

మ. ఎవరో నీచులు దీనిబారిఁ బడువాండ్రే యెప్పుడుంగూడ, మీ
రవనీదేవకులావతంసులును శిష్టాచారసంపన్నులున్
గవులున్ గాయకులున్ వరేణ్యులును నీకాలుష్యము న్నెట్టి మీ
భవ మీపై భగవంతుఁ డొప్పికొనుతేవన్ వర్తిలుం డెమ్మెయిన్.

ఉ. రాజకుటుంబులం దిది పురాతనకాలమునందు నున్నయ
ట్లోజఁ గవీశ్వరుల్ దెలుపుచుండిన నేమగు ? దాన, నన్ బలెన్
రోజునరోజుఁ గ్రోల రెవరో ? యెపుడో ? కుసుమాసవమ్ము లా
రాజులు వారియంతిపురిరాణులు గ్రోలిరి మంతనంబులన్. ౧౩౩

చ. ఇది తుదిరోజు మీకు, నిఁక నెన్నఁడు దీనికి నాస చేయకుం
డెద గుదియించుకొండు పరమేశ్వరుసాక్షిగ నొట్టు పెట్టికొం

డద నయినప్డు మాను నెదియైన పరేః విజితేంద్రియుండు. కో
విదులకు మీకుఁ జెప్పెడివివేకులుగూడ జగాన నుందురే ? ౧౩౮

వ. అని నొక్కినొక్కి వక్కాణించి వారలచేఁ బ్రమాణంబులు చేయించి
కొని వెండియు. ౧౩౯

క. పాపంబులు లోఁగడ నిది, యాపాదించినవి తూల మగ్నినెగకు నె
ల్లే పాటిపోవు నిపు డ,ల్లే పాఱుతఁ గృష్ణదేవుకృతులు నటింపఁగా.

మ. అని గోపాలురు గోపికల్ మఱియు నయ్యంభోజనేత్రుండు యా
మునతీరమ్మున నై కతమ్ముల నెటుల్ ము న్నాడిరో ? పాడిరో ?
జనపాలుండును వారు నట్లె భగవత్పాశాత్కృతిన్ గోరి భ
క్తిని నాట్యంబు లొనర్చి రప్సరసలున్ దేవుల్ దివిన్ జూడఁగన్.

సీ ఆజలక్రీడకు నీజలక్రీడకు
నంతరం బున్నదే యనెడివారు
ఆరాసకక్రీడ కీరాసక్రీడ
కేమి యంతర మంచు నెంచువారు
ఆవేణుగానాన కీవేణుగానాన
కగును బూర్ణోపమ యనెడివారు
ఆగాయనులకు నేఁ డీగాయనులకు నే
మంత భేదం బున్న దనెడివారు

తే. అపుడు శ్రీకృష్ణుఁడై పుట్టినట్టి హరియె
యిప్పు డితేఁడుగాఁ బుట్టెనేమొ ? లేక
యున్న నిది గాంచు మనమనయుల్లములకు
నబ్బునే మోద ? మనువారు నైరి సురలు. ౧౪౧

సీ. అటు తన్మయావస్థ నంది యానృపుఁడు శ్రీ
కృష్ణదేవుని శుచిక్రీడ లెల్ల

వారితోఁ గూడి యప్పర్వతమ్మున నాడి
సరగ "యాంతేమతి స్సా గతి" యను
గీత నిక్కమ్ముగాఁ గించిదామయపీడ
యును లేక భగవంతుమనికి కేగె
నాతఁడు తేఁడె కాఁ 'డానంద'వాచ్యమౌ
వాస్తవార్థ మెఱుంగువండితుండు
గీ. భోగి యోగియు నంట కొప్పుదురు వేద
వేత్త లితరులమాట లిం దెత్తనేల ?
మనము చూచినయోగి దమ్మాత్రియోగ
మేమొ ? 'యిద మిద్ధ' మని నిర్ణయింపలేము. ౧౪౩

క. పయికిఁబరిశుద్ధులుగ నుం,డియుఁ గలుషాత్మకులు గల రనేకులు పయికి
న్జెయువు లౌకభంగిగానుం,డియు లోకోత్తరులుగల రనేకులుజగతిన్.
గీ. ఇట్టు లావృద్ధరాజర్షి యెలమి నల్ల
వైశ్యయోగిచరిత్రమ్ము పాపవర్త
నంబు గాదని చెప్ప విన్న యలముగురు
నౌను గావచ్చు నని సంశయంబు విడిరి. ౧౪౫

చ. అలఘుమనీషులౌ జనుల కంతట మంచియె తోఁచుచుండు నిం
క లఘుమనీషులోః చెడుగుగానె సమస్తము గాంతు, రెల్లచోఁ
గలుగదు మంచి, చెడ్డయును గల్గదు రెండును మిశ్రభావమున్
గలిగి చరించు సంకరముగా, సహజం బిది యెందుఁ జూచినన్.

క. ఏయంకము లేకుండఁగ,నే యెల్లప్పుడును దేవు నెద నిల్పెడివా [మౌ
రీయుగమున మృగ్యులు నా,రాయణు నెటులేనిఁ దలఁప నది యఘహర
క. నారాయణపదభక్తియు, నారాయణసేవకార్చనమ్మును శ్రీమ [గున్
న్నారాయణుఁ దెత్తిన యవ,తారమ్ముల యెఱుకయు నఘతారకము ల

ఉ. కోమటి తేఁడు విప్రముని కోమలి వారవధూమతల్లియున్
నేమముమై రమేశ్వరుని నిత్యము భక్తిమెయిన్ భజించుచున్
సేమముగా నిటుల్ సకల జీవితమున్ గడపం దలంచి యా
భూమిధరమ్ము వాసముగఁ బొల్పుగ నుండిరి స్వస్థచిత్తులై. ౧౪౯

క. సూతుం డీగతి నొడివినఁ, బ్రీతహృదయు లగుచు మునివరేణ్యు లతనివి
ద్యాతిశయమునకు మెచ్చి య, నేతాదృశమైన పేర్మి నిట్లని రవలన్.

వ. రాజఋషి చెప్పినరాజయోగిచరిత్రంబువలనఁ బంచమహాపాతకంబులలో
నగ్రగణ్యంబగు సురాపానంబుగూడ భగవత్కథాశ్రవణమననాదులవల
న నివర్తించుటయ కాక యట్టిపాపాత్ములుగూడఁ దుట్టతుదకు ముక్త
లగుదు రని స్పష్ట మగుచున్నది, దీని నెట్లు విశ్వసింతుము నావుడు
సూతుం డిట్లను. ౧౫౧

గీ. జ్ఞాన మనునగ్నిహోత్రంబు సకలకర్మ
ములను భస్మం బొనర్చెడి మునివరేణ్యు
లీరు గీతార్థ మెఱుఁగనివారు కారు
గీత యుపనిషత్సార మోజ్ఞాతలార. ౧౫౨

గీ. ఉత్తమజ్ఞాన మొక్కటి యుద్భవింప
వలయునే కాని యయ్యది కలిగెనేని
వాని కిఁక దేనితోఁగాని పనియె లేదు
పార్థుఁ డొనరించె జ్ఞానియై భండనంబు. ౧౫౩

క. భండనముకన్నఁ బాతక, మొండుండునె? యెన్ని ప్రాణులో యటఁదనకో
దండమ్మున కెరయౌఁబా, ర్థుండొందెనె? యోద్ధయగుచు దోషమ్మందున్.

గీ. ఇతరయోగులపోకడ లెన్ననేల?
కృష్ణభగవానుకన్న నుత్కృష్టులైన
యోగు లెందేని గలరె? యచ్యుతునిగూడ
విశ్వసింపనిపాపిజ్ఞ లీపృథ్విఁ గలరె? ౧౫౫

గీ. "కృష్ణుఁ డస్ఖలితుం" డనియెడి వివేకు
లెందఱో గల "రిది సత్యమే" యటంచు
భాగవతమును శ్రద్ధగాఁ బఠనసేయు
విజ్ఞులకుఁ బొడకట్టెడి విశదముగను. ౧౫౬

క. అగుచో నాతఁడు ప్రద్యు, మ్నుఁ గనుటెకా కితరులైన పుత్రులఁ గనుటె
ట్లు గుదురు! యోగులచరితము, లగమ్యగోచరము లందు రక్కృతముననే.

గీ. కృష్ణుఁ "డవతారపురుషుఁ" డం చెఱిఁగికూడ
బ్రహ్మ గోవత్సముల డాఁచి పరిభవంబు
నొందు టెట్టిది? దేవేంద్రుఁ డురక రాల
వాన గురిపించి నగుఁబాటు పూననేల. ౧౫౭

క. నారదుఁ డలకృష్ణునిశ్శృం, గారరసపు వర్తనమును గన నెంచి వృథా
గా రాత్రి సర్వ మాతని, నీరజనేత్రలఁగృహములు నెమకఁగ నేలా ?

క. తఱచినకొలంది శంకా, పరంపరలు బయలువెడలుఁ బరమాత్మకథల్
దురితహారము లనుకొను ధీ, వరులకు సద్గతి లభించు వాస్తవ మింతే.

క. పలువురు కృష్ణున్ భక్తిం, గొలిచి తరించి రిఁకముందుఁ గొల్తురుధీమం
తులు లీలాశుకజయదే, వులు నారాయణయతియును బూర్ణజ్ఞానుల్.

గీ. ఎంత వేదాంతమునకు శ్రీకృష్ణచరిత
మును సమన్వయపఱచిన ఘనుఁడతండు
"యోగి" యని "భోగి" యనికూడ నొప్పికొనక
తీరదని తోఁచు నన మునిధీరు లనిరి. ౧౬౧

గీ. ఎట్టి విజ్ఞానులకు "నిద మిద్ధ" మనుచుఁ
బలుక శక్యము గాని దప్పరముచరిత
మతఁడు జారుఁడో ? చోరుఁడో ? యగునుగాక
భక్తనిచరిత మహాత్మ్యతల బగుట ధ్రువమ్ము. ౧౬౨

క. ప్రతివనితయు నమ్మహితుని, బతిగా వరియించు హావభావము లట సం
గతము లగుకతన నతనికి, "నతిజారుం" డనుకళంక మది ఘటియించెన్

ఉ. ఎప్పుడుగాని కృష్ణుఁ డొకయింతిని దా నయి కోరినట్టుగాఁ
జెప్పెడివారు లేరు పలుచేడియ లాతనిఁ జూచి నేమముల్
దప్పి చరించినట్టులె బుధప్రవరు ల్లిఖియించి రందుచే
నప్పురుషోత్తమోత్తమున కంట దఘం బనుకొంట యుక్తమా. ౧౬౫

మ. ఎవ రేరీతి ననున్ భజించెదరొ ? తాదృగ్రీతినే నేను వా
రి విలోకించి "తరింపఁ జేతు" ననుచున్ గృష్ణుండు వాక్రుచ్చె గో
పవధూటుల్ పతిభావనన్ దను మదిన్ బ్రార్థించుటంజేసి మా
ధవుఁ డవ్వారల కప్లై తోఁచి భవమున్ దాఁటించె వేయేటికిన్. ౧౬౬

క. జారత్వము ఘోరంబగు, నేరంబే యయ్యు నదియు నిఖిలేశ్వరుపైఁ
గూరిమికిఁ గారణంబై, తారకమంత్రమ్ముకరణి ధన్యత గూర్చెన్.

మ. భగవంతుం డని కృష్ణు నొప్పికొను నేభక్తుండు పచ్చర్య దా
"విగుణం" బంచు వచింపఁ డన్యులనుడుల్ విశ్వాస్యముల్ గావు పు
ణ్యగరిష్ఠం బది కాదయేని శుకుఁ డానందార్భకుంగూర్చి చె
ప్పఁగనేలా ? యభిమన్యుపుత్రున కటుల్ ప్రాయోపవేశమ్మునన్.

వ. ఇవ్విధమ్మున సూతునివచనమ్ములను శౌనకాదు లభినందించి గౌరవించి
యాతఁడును దామును నిరంతరము భగవద్గోష్ఠితోఁ గాలక్షేపమ్మొనర్చు
చు సుఖంబుండిరి. ౧౬౮

శ్లో. సంసారే కిం సారం, కంసారే శ్చరణకమల పరిభజనమ్
జ్యోతిః కి మంధకారే, య దంధకారే రనుస్మరణమ్.

(కృష్ణకర్ణామృతము)

శ్రీ శ్రీ శ్రీ

# షష్ఠాశ్వాసము.

## కృతిప్రదానము.

ఊరక సర్వదా శయన మూని గృహమ్మున నుండు నాకు వ్యా
పారము కావ్యనిర్మితియె, బాగుగ నుండిన నుండకున్న నే
దో రచియించుచుందు, నిది యొక్కటి యారచనంబునందు శ్రీ
వారిజనాభభక్తుఁ డొకబ్రాహ్మణుఁ డిద్ది వినెం బిఠాపురిన్. ౧
పెద్దకొమార్తెఁ జూచుటకుఁ బీఠపురంబున కేగి యచ్చటం
దద్దయుఁ బేర్మి నుండ నొకనాఁ డితఁ డీననుఁ జూడ వచ్చి తా
నిద్ది వినెన్ గృతీశ్వరత కిచ్చ గనంబఱచెన్ "దథా" స్తటం
చిద్ది యొసంగితిన్ గవియుఁ గృష్ణునిభక్తుఁడునైన జ్ఞానికిన్. ౨
ఇతఁడుమాత్రమె కవి గాఁడ యితనితాత
గూడ నుభయభాషలఁ గడు గొప్పసుకవి
అంతియేకాదు రామదాసంతభక్తుఁ
డాఖ్యచేత జగన్నాథుఁ డతఁడు నితఁడు. ౩
ఇతనిజగన్నాథత్వము, కృతార్థ మెట్లన్న నెన్నియేఁడులో భూమీ.
పతికిం బ్రతినిధియై యధి,కృతియం దీతఁడు రహించి యిప్పు డది విడి
ఉపకారవేతనము మూ (చెన్.
సపువరుస న్నూఱు తేఁ డొసంగ సుఖముగా
నెపుడుం గృష్ణు యజింపుచు
సుపుణ్యుఁ డీతండు పెంచు సుకృతము మిగులన్ ౪
తే. షష్టిపూర్తికి నైదుమాసములలోపు
వయసునం దుండియును దేహబలము గలిగి
దీక్షతోఁ బుండరీకాక్షు దినదినంబుఁ
బూజ వేయక సీరేని ముట్టఁ డితఁడు.
క. ఇరువురు భార్య లొకొక్క కొ
మరుమాత్ర మొసంగి చనిరి, మాధవుకృపఁ దా

మరతంపరగాఁ గుల ము
ద్ధరింపఁ బడుఁగాక । కోటితరములదాఁకన్.

మ. ఘనుఁ డుద్యోగి యశస్వి పాత్రుఁడు రమాకాంతాంఘ్రినీరేజవం
దననిర్ధూత సమస్తకల్మషుఁడు సత్కావ్యప్రణేత్రర్చకుం
డనుకూలంబుగఁ గైత సెప్పఁగలవాఁ డన్యాంగనన్ దల్లిగన్
గనువాఁ డుత్తముఁ డూర్జితాత్ముఁడు జగన్నాథుండు ధన్యుం డిలన్.

చ. ధన మధికంబుగాఁ గలదు ధారుణినాథుల కల్లవారిలోఁ,
గనుపడు నెక్కడో యొకటఁ గావ్యరసగ్రహణంబు, వారి కి
చ్చినకృతికన్నఁ దాఁ గవిత సెప్పఁగ నేరుచు మేటిగేస్తు కి
చ్చినకృతికన్య ధన్య యని చెప్పుట కొప్పని విజ్ఞు లుందురే. ౧౦

క. మానుగ మాధవుపై లక్ష్మీనారాయణునిమీఁదఁ జెటియొకశతకం
బీనియమస్థుఁ డొనర్చె న,నూనంబగు భక్తిగరిమ మున్పొంగంగన్.

శా. 'భక్తత్రాణపరాయ'ణాంకితము కబ్బం బొండు గల్పించె ని
ర్ముక్తాఘుండు పితామహుం, డితఁడు తత్పుస్తంబు తెల్గించె సు
వ్యక్తంబౌగతిఁ దాతగారి కవితాపాండిత్యమే కాదు త
ద్భక్తిస్ఫూర్తియు నంటె నీతనికి, నీభాగ్యంబు సామాన్యమే. ౧౧

మ. ధనమున్ ధాన్యము నిల్లు వాకిలి జమీందారీ మొదల్ వంశవ
ర్ధను లెల్లం గొను టున్నదే సుతులు, సత్కావ్యప్రణేతృత్వమున్
ఘనదాతృత్వము దైవభక్తి మొదలౌ కాణాచియున్గూడ ద
క్కినటుల్ విన్నది లేదువో । తలఁచు, దక్కెన్నేఁటి కీమేటికిన్. ౧౩

సీ. నాతాత సుకవియై నాఁటె బీజమ్ము మా
కాలములో నని చెప్పికొనెడివారు
నాదుముత్తాత విద్యాదక్షుఁ డతని ము
న్మనుమఁడ నని చెప్పికొనెడివారు

పెదతాత దాతయై విజ్ఞులఁ బోషించె
నని గర్వమునఁ జెప్పికొనెడివారు
నాతండ్రిగారి విన్నాణమ్మునకుఁ బ్రతి
గన రెవ్వ రని చెప్పికొనెడివారు

గీ. కలరుగాని తత్తద్గుణగణము దాయ
భాగముగఁ బంచుకొని మెచ్చు వడయువారు
చాల మృగ్యు, లీభాగ్యము సంక్రమించె
మనజగన్నాథరాయని కనఘుఁ డితఁడు. ౧౪

ఉ. ఈతనివంశమున్ గుఱిచి యించుక యిక్కడ విస్తరింతుఁ బ్ర
ఖ్యాతుఁడు లోహితర్షి మునిగణ్యుఁడు, తన్మునివంశమందు వి
ద్యోతితుఁ డుద్భవించెఁ గడు యోగ్యుఁడు తిమ్మయ, యయ్యశస్విసం
జాతుఁడు రామయాహ్వయుఁడు సత్త్వగుణాఢ్యుఁ డుదారుఁ డెమ్మెయిన్

వ. ఈరామయామాత్యునకు వేంకటరావు నరసింహరావు తిరుమలరావు నను
ముగురు కొమరులు. వారిలో ౧౬

క. నరసింహరాయఁ డచ్చమ,సరసీరుహనేత్ర తనకు జాయగ సుతులన్
వరగుణుల నోలిఁ గనె నేఁ,గురఁ జిరతరయశుల,నైదుగురు హరిభక్తుల్

వ. బాయన్న రామస్వామి పద్మరాజు జగన్నాథరాయఁడు చెల్లయ్య అను
నీసోదరపంచకమ్ములో ౧౭

గీ. నాలుగవవాఁడు శ్రీజగన్నాథరావు
కవియు భక్తుండుఁ బ్రకృత మీగ్రంథము కృతిఁ
గొనినమేటికిఁ దాత యీఘనునిఁగూర్చి
యాదినే వచియించితి నలఘుఁ డితఁడు. ౧౮

క. ఇతఁ డుద్యోగము లొల్లక
ప్రతిదిన మచ్యుతునికొలువు వ్రతముగఁ దనకై

వితమున్ గడపిన ధన్యుం
డితనికిఁ బ్రతి రామదాసుఁడే హరిభక్తిన్. ౨౦

*గీ. ఇతఁడు తనభార మెల్ల శ్రీపతిపదాబ్జ
సంగత మొనర్చినట్టి నిస్సంగుఁ డీవి
షయము నీమహనీయుని సత్కవిత్వ
మును జదివి నే గ్రహించితి ముక్తుఁ డితఁడు. ౨౧

గీ. భరసమర్పకుఁ డైనయీపరమభక్తు
ఛాందసవుఁజర్య లిచ్చు నానంద మట్టి
వారలకు, నేఁటినాగరవర్తనులకు
వెట్టిగాఁ దోఁచునని యిందు విడిచినాఁడ. ౨౨

గీ. కావ్యనాటకాలంకృతి కళలు శిష్యు
లకు ననుదినంబు చెప్పు నీసుకవివరుఁడు
రాము నెల్లప్డు స్మరియించు నేమముగ ని
తండు ధన్యుండు గాక యేతండు జగతి.

క. లచ్చమ యను వనితామణి
సచ్చరిత నితండు గొనియె జాయగఁ, గడు ను
ద్యచ్చరితుల నేఁగుర నే
మచ్చయు లే కలరు నట్టిమాన్యులఁ గనియెన్. ౨౪

వ. వెంకన్నపంతులు, నరసింహులు, నారాయణమూర్తి, సోమసుందర వేంకట రామదాసు (ఈయన పరమభక్తుఁడును సుకవియు నై యక్షగానములు రచించెను.) శేషయ్య అను నీసోదరపంచకమ్మున జ్యేష్ఠుండు వెంకన్నపంతులు బాల్యం బేగినదే మొదలు శ్రీగొణే నారాయణగజపతి రాయని యనుంగుమంత్రియై బహుజనపోషకుండై సిరిసంపదలతో నెక్కుడుగఁ దులఁదూఁగె, నియ్యనఘునకు నౌకరి వెంబడి వేఁటొకరుగా

* భక్తత్రాణపరాయణశతకము నితఁడు రచించెను.

మూఁగురు భార్యలు వారిలోఁ గడఁగొట్టునర్ధాంగి వేంకటేశాంబికమాత్రమే వంశాభివృద్ధికారకురాలు. ప్రకృతకృతిభర్తయైన శ్రీలక్ష్మీజగన్నాధరా వాపెకొమరులు నల్వురలో ద్వితీయుఁడయ్యు నద్వితీయగుణగణసంపన్నుం డనఁదగువాఁడు. ఈయనయన్న వేంకట వేణుగోపాలరావు. తమ్ములు వేంకట రమణారావు, తిరుమలరావు నునువారలు. ౨౫

క. కృతినాయకుండు తాతకుఁ
బ్రతి యని చెప్పఁదగు పరమభక్తుం డీతం
డు తరించె యాత్రలొనరిచి;
పితరులఁ దరియింపఁజేసె విహితక్రియలన్. ౨౬

గీ. "ఏగె బ్రహ్మకపాలంబు నీతఁ" డనినఁ
దక్కుయాత్రల కేగుట తడవనేల?
అసకృదావృత్తిగాఁ జేసినట్టియవియుఁ
గలవు గొన్నియాత్రలు, కడు నలఘుఁ డితఁడు. ౨౭

ఉ. ఈమహితుండు పీఠపురి నిష్ఠ వసించుచుఁ గుంతిమాధవ
స్వామిదేవళమ్మునెడ స్థాపనఁ జేసెను లక్ష్మి; నాత్మస
న్నామములోని లక్ష్మికలనం బది సార్థకమై యెలర్పఁ, బై
నామెకు దేవళం బితఁడె యాస్థమెయిన్ వెలయించె సొంపుగన్. ౨౮

గీ. భాష్యకారార్యుఁ డీయనభక్తి నెఱిఁగి
యిట్టికృతికిఁ బ్రేరేచె నీదట్టుఁ 'ద్వైతి
ధన్యుఁడ' నటంచుఁ దనదువదాన్యత కొక
గుఱుతుగా నొనరించె నీగొప్పపనిని. ౨౯

క. లింగికులమయ్యు వైష్ణవు
లం గలపెం బూర్వమెపుడొ లవమును శివుపై
విం గినియఁడు పూజించు న
నంగరిపు నితండు దీని కక్కజపడుదున్. ౩౦

క. లోహితసగోత్రభవున క, నీహానకున్ గురున కొక్కఁ డిచ్చితిఁ గృతి నేఁ
డీహితునకుఁ గృతి నిచ్చితి, లోహితగోత్రుం డితండు లోకనుతుండున్,

క. ఉదయాస్తమయంబులఁ గో, విదగణ్యుం డితఁ డొనర్చు విష్ణ్వర్చన మ
భ్యుదయార్థమొ? ముక్త్యర్థమొ? కుదిరిన దీయనకు నీసుగుణ మలవాటై.

క. శేషావతార మీసుమ, నీషి మొదటిభార్య. యీపె కిరువురు కొమరుల్
శేషించె నం దొకం, డే, దోషమొ? జ్యేష్ఠుండు వోయె దుఃఖప్రదుఁడై.

క. వెంకన్నపంతు లతఁ డా, వెంకనయనుజుండు వైద్యవిద్యాఘనుఁడై
శంకరుఁడై పల్వూర, కక, లంకుఁ డనంతుండు రామరా వలరారున్.

ఆ. సుందరమ్మ యనెడి సుందరి యీతని
భార్య. యితనికి సదపత్యవృద్ధి
గలదు కొడుకు లిర్వు రలఘులు, కూఁతులు
నిద్ద ఱిట్లు వంశ మెదుగుఁగాక. ౩౫

గీ. అలజగన్నాధరావు రెండవ వెలంది
యనఘ వేంకటరమణాంబ ఆపెకొమరు
నాఖ్య వేంకటరంగతోతాద్రిదాసు
బాలుఁ డీతండు హరికృపఁ బ్రబలుఁగాక. ౩౬

ఆ. ఇట్టిసత్కుటుంబి యీలక్ష్మి శ్రీజగ
న్నాధరావు దక్షిణమున నుత్త
రమున నున్న తీర్థరాజమ్ములెల్ల నే
వించి దేవతల భజించె భక్తి. ౩౭

వ. ఏవంవిధ పుణ్యగుణగణ గరిష్ఠుండును నిరంతర నారాయణ పాదపద్మ సమారాధనాసక్త చిత్తుండును శ్రీవైష్ణవకుల శిరోభూషణుండును దేవ బ్రాహ్మణభక్తి తత్పరుండును నిరాడంబరుండును నిర్లిప్తుండును గవితా రససర్వస్వవేదియు సతతామోదియు నగు శ్రీలక్ష్మిజగన్నాధరాయనికి నభ్యుదయపరంపరాభివృద్ధి యగుటకై యీసుశీల నంకితం బిచ్చుచు నాశీర్వదించుచున్నాఁడను. ౩౮

## ఆశీర్వాదపద్యములు.

శా. శ్రీధామస్థితి నీవునున్ బలెనె కాంచె న్మేటి సుద్రాధికా
రాధారుండయి మించె గర్వము లవంబైనం గనం డుత్తమ
ప్రాధాన్యంబున నెన్నఁగాఁ దగినవిప్రస్వామి లింగం జగ
న్నాధున్ బుత్రసనాథుఁ బ్రోవు కృపఁ గృష్ణా ! త్వద్దయాపాత్రునిన్.

శా ఏధీమంతులకన్న మిన్న కవితాహేలావినోదమ్మునన్
సాధుశ్లాఘ్యము గాఁగ జీవితము నిచ్చల్ పుచ్చుచున్ దీర్ఘయా
త్రాధామంబులు సర్వమున్ దిరిగెఁ దాత్పర్యమ్మునన్ మాజగ
న్నాధున్ బుత్రసనాథుఁ బ్రోవు కృపఁ గృష్ణా ! త్వద్దయాపాత్రునిన్.

మ. చదివెన్ పూరాణకలార్థియై పిదప నుచ్చైస్థానమున్ జెందె నె
ట్టి దశన్ గూడ భవత్పదాబ్జభజనాటీకస్థితి న్నిచ్చలున్
మది విల్వన్ గనుఁగొంటివే ? యొకట నీమాన్యాత్మునిం బోలు స
ద్విదితున్, వీని ననుగ్రహింపుము జగద్విఖ్యాతు లింగాన్వయున్. ౪౨

శా. వీనామంబు జపించి భక్తిగరిమ న్నీ కర్చ గావించి యా
పై నైవేద్యము చేసి గాని భుజియింపం డున్నతోద్యోగియై
యీనాఁ డీదృశరాజమంత్రులును నెందే నుండిరే ? పేర్మిమై
వీనిన్ లింగముసత్కులీనుఁ గరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ. ౪౩

శా. శ్రీరామారమణుండు భక్తజనతాక్షేమప్రదానోల్లస
త్కారుణ్యాస్పదుఁడైన శ్రీహరి స్వభక్తశ్రేణిలో వానిఁ జె
ల్వారన్ లింగమువంశనీరనిధి పూర్ణాబ్జున్ గృపన్ సద్గుణో
దారున్ ధీరుని బ్రోచుఁగావుత జగన్నాధాఖ్య మంత్రీంద్రునిన్. ౪౪

సమస్త సన్మంగళాని భవంతు.

గద్య.

ఇది శ్రీ తిరుపతివేంకటీయంబగు సుశీల యను కేవలకల్పిత ప్రబంధంబునందు సర్వమ్మును

షష్ఠాశ్వాసము